

# చందమామ

సెప్టెంబర్ 1988



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు


| | | | |
|---|---|---|---|
| చందమామ కబుర్లు .... | 9 | మణిమంజీరం—1 .... | 35 |
| శిరశ్ఛేదన .... | 10 | నీతిబోధన .... | 39 |
| అయోగ్యుడిఅదృష్టం .... | 11 | కృష్ణావతారం—13 .... | 43 |
| కట్నంతంతు .... | 17 | మూడోప్రశ్న .... | 51 |
| బంగారులోయ—11 .... | 19 | తల్లిసలహా .... | 56 |
| అపూర్వకిరీటం .... | 27 | ఫలించనివరం .... | 59 |
| అజ్ఞాతపండితుడు .... | 33 | ప్రకృతివింతలు .... | 63 |





విడి ప్రతి: 2-50

సంవత్సర చందా: 30-00




# వినోద ప్రపంచంలో అడుగుపెట్టండి-
# మేగీ క్లబ్ సభ్యులు అవండి!

మేగీ క్లబ్‌లో సభ్యులయ్యేందుకు, 5 ఖాళీ మేగీ నూడుల్స్ ప్యాకెట్ల ముందువైపున గల 'Maggi 2-Minute Noodles' అన్న పేరు కత్తిరించి, మాకు పంపించండి, మీజీవిత సభ్యత్వముకోసం, ఒక సూపర్ మేగీ క్లబ్ సభ్యత్వపు బ్యాడ్జి, ఒక ఎన్‌రోల్‌మెంటు సర్టిఫికేటు పంపిస్తాము. దీనితోబాటు, యీ క్రింది బహుమతులలో ఒకటి ఎంచుకునే అవకాశం—

* మేగీ స్కూల్ సన్‌సెట్ (ఒక టైంటేబుల్ మరియు 20 బుక్ లేబుళ్ళు)
* మేగీ ట్రాఫిక్ గేమ్ * చైనీజ్ పజిల్ * మేగీ పోస్టర్ల సెట్టు
* డిస్నీ టుడే కామిక్ (ప్రతిసారి తాజా సంచిక)

మీకు కావలిస్తే, కొంతకాలం వ్యవధిలో, ఒక్కొక్క బహుమతికి 5 రేపర్లు చొప్పున పంపి, యీ అన్నీ బహుమతులను కూడా సేకరించుకోవచ్చును.

అంతే అనుకున్నారా! మేగీ క్లబ్‌లో భవిష్యత్తులో ఎన్నెన్నో ఉత్తేజకరమైన సంఘటనలు జరుగుతాయి. కాబట్టి ఈరోజే సభ్యులుగా చేరండి!




**ఇది చాలా ముఖ్యం!**

మీరు కత్తిరించిన పేర్లని 60 పైసల స్టాంపులు అతికించిన కవరులో పెట్టండి, ఈ క్రింది వివరాలను ఒక చిన్న కాగితంమీద వ్రాయండి.

పేరు, పూర్తి చిరునామా, వయసు, బాలుడు/బాలిక

జతపరిచిన కత్తిరింపు ముక్కల సంఖ్య. మీకు కావలసిన బహుమతి.

మీరు మీ ఉత్తరాన్ని మాకు, ఈ చిరునామాకు పంపండి:
ది మేగీ క్లబ్, పోస్ట్‌బాక్స్ నం. 5788, న్యూఢిల్లీ-110 055.




HTA 6026TEL




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''అపూర్వకిరీటం''] కు ఆధారం, మల్లవరపు మనోహరరెడ్డి రచన. అదృష్ట దురదృష్టాలనేవి, సమాజంలోని ఆయా వ్యక్తుల స్థితిగతులమీద ఆధారపడి వుంటవి. ఒక మహా రాజుకు, విలువైన వజ్రం దొరకడం అదృష్టం అనిపించుకోదు. అదే ఒక పేదవాడికి దొరికితే, గొప్ప అదృష్టం అవుతుంది. ఈ తారతమ్యాన్ని చక్కగా వివరిస్తుంది, ''అయోగ్యుడిఅదృష్టం'' అన్న కథ.

## అమరవాణి

అరావప్యుచితం కార్యమాతిథ్యం, గృహమాగతే,
ఛేతుః పార్శ్వగతాం, ఛాయాం నోపసంహరతే ద్రుమః.

[శత్రువైనాసరే ఇంటికి అతిథిగా వచ్చినప్పుడు ఆదరం చూపాలి. చెట్టు తనను నరకడానికి వచ్చినవాడికి సైతం నీడ నిస్తుంది కదా!]

సంపుటి 83 సెప్టెంబర్ '88 సంచిక 3

విడి ప్రతి : 2–50 : : సంవత్సర చందా : 30–00

# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ, పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.



6 మాసాలు నించి



4 మాసాలు నించి



6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి. సెరిలాక్
పోస్ట్ బాక్స్ నెం 3
న్యూ ఢిల్లీ 110008




## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

RK SWAMY/FSL/5112/TEL

# చందమామ కబుర్లు



## అంధులపర్వతారోహణ!

పశ్చిమ హిమాలయాలలోని 16,000 అడుగుల ఎత్తయిన పటాల్స్ పర్వతాన్ని ఇటీవల పూనేకు చెందిన ఇద్దరు అంధ యువకులు అధిరోహించారు. దత్తాత్రేయమోల్, మోహన్ కాంబ్లే అనే ఆ అంధయువకులు మరి ముగ్గురి సహాయంతో, పర్వతాన్ని అధిరోహించి, మన దేశంలో కొత్త రికార్డు సృష్టించారు।

## రాక్షసబల్లులు ఎలా నశించాయి?

60 మిలియన్ సంవత్సరాల క్రితం భూమిపై నివసించిన డినోసార్స్ అనే రాక్షసబల్లులు హఠాత్తుగా ఎలా నశించాయి? అన్న విషయం మీద విజ్ఞానవేత్తలు ఎన్నో పరిశోధనలు జరిపి ఇటీవల ఒక నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. అగ్నిపర్వతాలు బద్దలు కావడంతో సూర్యగోళం మూసుకు పోయిందనీ, భూగోళంలో ఎన్నో మార్పులు వచ్చాయనీ, అప్పుడు కురిసిన 'ఆమ్లవర్షా'నికి గురై రాక్షసబల్లులన్నీ నశించి వుంటాయని అందులో పేర్కొన్నారు।





## వెయ్యేళ్లనాటి పాకశాల

పూరీజగన్నాధఆలయంలోని పాకశాల — రోజూ వేలకొలది మందికి సరిపడా భోజనం తయారు చేసేంత పెద్దది. గత వెయ్యి సంవత్సరాలుగా ఉపయోగంలో వున్న ఈ పాకశాలను ప్రపంచంలోకెల్లా ప్రాచీనమైన పాకశాలగా చెప్పుకుంటారు।

## పరిభ్రమణవేగం!

విశ్వాంతరాళంలో అమితవేగంతో పరిభ్రమిస్తూన్న రెండవ నక్షత్రాన్ని ఇటీవల విజ్ఞానవేత్తలు కనుగొన్నారు. 16 కి. మీ. వెడల్పు గల ఈ నక్షత్రం ప్రతి 1.6 మిల్లీ సెకండుకు ఒక చుట్టు పరిభ్రమిస్తుంది. మిల్లీసెకండు అంటే ఒక సెకండులో వెయ్యోవంతు।



# శిరశ్ఛేదన

ఒకానొక రాజుకు, అంతుపట్టని వ్యాధి కలిగింది. ఎన్ని వైద్యాలు జరిగినా, ఆ వ్యాధి ముదురుతున్నదేగాని కుదరడం లేదు. దీనితో రాజు బాగా విసిగిపోయి, "నా వ్యాధి కుదిర్చినవాళ్ళకు అర్ధరాజ్యం యిస్తాను. కుదురుస్తానని వచ్చి, కుదర్చలేనివాళ్ళకు శిరశ్ఛేదనం చేయిస్తాను," అని ప్రకటించాడు.

ఈ ప్రకటన విని, అర్ధరాజ్యం కోసం ఆశపడిన కొందరు వైద్యులు వచ్చి, రాజుగారి వ్యాధి కుదర్చలేక ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఇలా వైద్యులు నశించిపోతూంటే, దేశంలోని రోగులగతేమిటి? అన్న శంక ఒక గొప్ప వైద్యుడికి కలిగింది.

ఆయన బాగా ఆలోచించి రాజు దగ్గిరకు వచ్చి, "రాజా, మీ వ్యాధి నయం చేయగలనని, నేను పందెం వేస్తున్నాను. మీరా పందానికి ఒప్పుకుంటారా?" అని అడిగాడు.

"ఏమిటాపందెం?" అన్నాడు రాజు.

"తలపందెం! నేను వ్యాధి నయం చేయులేకపోతే, నాకు శిరశ్ఛేదం చేస్తారు. నయం చెయ్యగలిగితే, మీ తల యిస్తానని పందెం వెయ్యండి," అన్నాడు వైద్యుడు.

"వ్యాధి కుదిరాక, నేనెందుకు శిరశ్ఛేదం చేయించుకోవాలి?" అని కోపంగా అడిగాడు రాజు.

"వ్యాధి కుదర్చకపోతే, నా తల తీస్తారు. కుదిర్చితే, మీతల నేనెందుకు కోరకూడదు?" అని అడిగాడు వైద్యుడు.

రాజుకు, వైద్యుడి ప్రశ్నలోని అంతర్యం అర్థమైంది. ఆయన శిరశ్ఛేద ప్రకటన రద్దు చేశాడు. వైద్యుడాయనకు చికిత్సచేసి, వ్యాధి నయం చేసి, రాజుచేత ఘనమైన సన్మానం పొందాడు.

—ఆర్. రేవతి





# అయోగ్యుడి అదృష్టం

ఒకనాటి మిట్టమధ్యాహ్నం వేళ, భైరవు డనే యువకు డొకడు అడవిలో గొర్రెలను మేపుతున్నాడు. ఉన్నట్టుండి వాడు ప్రాణంగా పెంచే గొర్రెపిల్ల ఒకటి, మంద నుంచి వేరుపడి ఎటో వెళ్ళిపోయింది. వాడు దాన్ని వెతుకుతూ పోయి, ఒక గుహను చేరాడు. గుహకు ఒక బండ రాయి అడ్డం వున్నా, ఒక పక్కన మనిషి దూరేంత కంతవున్నది.

భైరవుడికి గుహముందు గొర్రెపిల్ల అడుగుల జాడ కనిపించింది. గొర్రెపిల్ల గుహలోకి పోయి వుంటుందని ఊహించి, వాడు కంతలో నుంచి గుహలోకి వెళ్లాడు. అక్కడ కనిపించిన దృశ్యం వాణ్ణి భయ కంపితుణ్ణి చేసింది.

గుహ మధ్య ఒక ఎత్తయిన రాతి పైన యోగాసనంలో వున్న మనిషి అస్థిపంజరం వున్నది. దానికి యిరుపక్కలా దండ, కమండలా లున్నవి. ఎవరో మునీశ్వరుడు తపస్సులోనే కాలం చేసి వుంటాడని, భైరవుడు గ్రహించాడు.

అ సమయంలో వాడికి విపరీతంగా దాహం వేయసాగింది. వాడు ముందు వెనుకలు ఆలోచించకుండా, పోయి కమండలంలోని జలం తాగి, చుట్టూ కలయచూశాడు. గుహలో ఒక మూల నిలబడి వున్న గొర్రెపిల్ల, వాడి కంట బడింది.

వాడు గొర్రెపిల్లను ఎత్తుకుని, గుహ నుంచి బయటికి వచ్చి మందకేసి నడుస్తూండగా, కాలిలో ముల్లు గుచ్చుకున్నది. భైరవుడు బాధ భరించలేక ''అయ్యో!'' అంటూ పెద్దగా అరిచాడు. మూగవాడైన తనకు మాట రావడం చూసి, వాడు పట్టరాని సంతోషంతో ఎగిరి గంతేశాడు.

వీరేపల్లి జయరాంరెడ్డి



అయితే, మంద చేరాక వాడికి తన గొర్రెపిల్ల తోక తెగిపోయి వుండడం కనిపించింది. వాడు, "నా గొర్రెపిల్లకు లాగే, అన్ని గొర్రెల తోకలూ మాయమైతే ఎంత బావుండును!" అని గొణుక్కున్నాడు.

భైరవుడు చీకటిపడేవేళకు మందతో ఇల్లు చేరాడు. తెల్లవారిన తర్వాత, ఊళ్లో ఏ ఒక్క గొర్రెకూ తోక లేకపోవడం చూసి వాడు చాలా వింతపడ్డాడు. తనకు మాటతో పాటు, ఏది మాట్లాడితే అది వెంటనే జరిగే శక్తికూడా వచ్చినట్టు, వాడు తెలుసుకున్నాడు.

మూగవాడైన భైరవుడికి హఠాత్తుగా మాటరావడం, వాడికి అబ్బిన మహత్తరమైన శక్తి గురించి గ్రామంలో అందరికీ తెలిసిపోయింది.

గ్రామంలోని గొర్రెల కాపర్లు, వాడి దగ్గరకు వచ్చి, "భైరవా, నీ గొర్రెపిల్లకు మళ్ళీ తోక వచ్చేట్టు కోరితే సరిపోయేది గదా! బెత్తెడు తోకలయినా లేని గొర్రెల మందలను ఎవరు కొంటారు, నువ్వే చెప్పు," అన్నారు విచారపడుతూ.

భైరవుడు తన మాట ప్రభావంతో, తిరిగి అన్ని గొర్రెలకూ తోకలు వచ్చేలా చేశాడు.

ఆ రాత్రి, ఆ గ్రామ జమీందారుగారి దివాను మనుషులు వచ్చి, భైరవుణ్ణి పిలుచుకు వెళ్ళారు. దివాను వాడికి మర్యాదచేసి, "నువ్వు, నా కోరిక ఒకటి తీర్చావంటే కోరిన ధనం యిస్తాను. తెల్లవారేలోగా జమీందారు, ఏ మాయదారి జబ్బుతోనో చావాలని పలుకు. ఆయన్ని హతమార్చడం, నావల్ల కాలేదు. నువ్వా పని చేస్తే, సంతతి లేని ఆయనకు, నేను వారసుణ్ణి అవుతాను," అన్నాడు.

జమీందారంతవాణ్ణి చంపడమా అని, భైరవుడు భయపడిపోయాడు. దివాను బలవంతంగా వాడిచేత, ఆ పని చేయించేందుకు చీకటికొట్లో వేయించాడు. వాడికి అందులో నుంచి బయటపడేశక్తి వున్నా, సమయానికి అది అకళింపుకు రాక తెల్లవార్లూ అక్కడే వుండిపోయాడు.

అయితే, తెల్లవారాక దివాను మనుషులు వచ్చి, చీకటికొట్టు తలుపులు తెరిచి, "భైరవా, జమీందారును చంపాలనుకున్న దివాను, రాత్రి అంత ఎత్తుమేడ మెట్లపై నుంచి కిందపడి ప్రాణాలు పోగొట్టుకున్నాడు. మేము నీకు చేసిన హాని ఏమీ లేదు. మమ్మల్ని మాత్రం చంపకు," అని బతిమాలారు.

ఇక ఆ గ్రామంలో వుండడం ప్రమాదమని, భైరవుడు తిన్నగా ఇంటికి పోయి, తన గొర్రెలమందను తోలుకుని అరణ్యంకేసి బయలుదేరాడు.

అరణ్యంలో వాణ్ణి, ఒక దొంగలగుంపు అడ్డగించింది. వాడు వాళ్ళను చూసి బెంబేలెత్తిపోతూ, "అయ్యలారా, కావాలంటే, యీ మందను తీసుకుని నన్ను వదిలెయ్యండి. నేను మామూలు మనిషిని కాదు!" అన్నాడు.

వాడి మాటలకు దొంగలు పెద్దగా నవ్వసాగారు. అంతలో, ఒక చిరుతపులి పొదలచాటు నుంచి దూకి, ఒక గొర్రెను యీడ్చుకుపోసాగింది. భైరవుడు పెద్దగా అరుస్తూ, "ఓసి, నీకేం పోయేకాలమే!" అన్నాడు.

అ మరుక్షణం చిరుతపులి గిలగిల తన్నుకుని ప్రాణాలు వదిలింది. ఇది చూసి దొంగలు హడలెత్తిపోయారు. దొంగలనాయకుడు చప్పున తన తలపాగా తీసి, భైరవుడి నోటికి అడ్డం కట్టి, వాణ్ణి తన నివాసస్థానానికి తీసుకుపోయాడు.





అయితే, ఆ రాత్రి రాజభటులు దొంగల స్థావరాన్ని చుట్టుముట్టి అందర్నీ బందీలుగా పట్టుకున్నారు. భైరవుణ్ణి, దొంగల పాలబడిన ఏ యాత్రికుడో అనుకుని వదిలిపోయారు.

ఆ క్షణంలో వాడికి తన గొర్రెలమంద గుర్తుకు వచ్చింది. వాడు ఎంతో విచారంగా, "నా గొర్రెలన్నీ పులిపిల్ల దేహాల్తో పుట్టి వుంటే ఎంత బావుండేది. ఏ క్రూర జంతువూ వాటి జోలికి వచ్చేదికాదు గదా!" అన్నాడు.

ఆ వెంటనే, వాడి గొర్రెలమంద పులిపిల్ల రూపాలతో వాడి ముందు ప్రత్యక్షమైంది. భైరవుడు వాటిని వెంటబెట్టుకుని రాజధానికి బయలుదేరాడు. ముందు మనిషి, వెనకగా పులిపిల్లలు నడుస్తూండడం చూసి, జనం హాహాకారాలు చేస్తూ పరిగెత్తసాగారు. కాని, తర్వాత అవి గొర్రెల్లా అరవడం చూసి ఎక్కడలేని ఆశ్చర్యం పొందారు.

ఈ వింత సంగతి, ఆ రాజ్యపు మంత్రి విని, వాణ్ణి పిలిపించి, "ఎవరివి నువ్వు? పులిపిల్లలు గొర్రెల్లా అరవడం ఏమిటి?" అని ప్రశ్నించాడు.

అందుకు వాడు గర్వంగా, "మంత్రిగారూ, నేనెవరినైతే ఏం? ఈ పులుల్ని సింహాలుగా కూడా మార్చగలను." అంటూ వాటిని సింహాలుగా మార్చాడు.

మంత్రికి, భైరవుడు మహాశక్తిమంతుడన్న నమ్మకం కలిగింది. ఆయన వాణ్ణి రాజు దగ్గరకు తీసుకుపోయి, సంగతి చెప్పి, సలహాదారుగా నియమించుకోమని కోరాడు. తన మంత్రి ఏది చేసినా, అందుకు తగుకారణం వుంటుందని ఎరిగి వున్న రాజు అందుకు ఒప్పుకున్నాడు.

ఆ తర్వాత మంత్రి, ఆయనతో రహస్యంగా, "మహారాజా, ఈ భైరవుడు సామాన్యుడైనా, వీడికి అసామాన్యమైన శక్తి వున్నది. అయితే, దాన్ని ఉపయోగించుకోగల తెలివిమటుకు శూన్యం. ఇటువంటి వాడు, మన శత్రువుల చేజిక్కితే,

చాలా ప్రమాదం. మంచిగా చెప్పి, వీడి ద్వారా ఎన్ని పనులైనా సాధించుకోవచ్చు." అని చెప్పాడు.

భైరవుడికి ఒక విశాలమైన మందిరం కేటాయించారు. అందులో వాడికి కోరిన భోజనం, వినోదాలు ఏర్పాటు చేయబడ్డాయి. క్రమంగా రాజు, వాడి ద్వారా ఎన్నో అసాధ్యమైన రాచకార్యాలు చక్కదిద్దాడు. ఆయనకు శత్రుభయం అంటూ లేకుండా పోయింది.

ఒక రోజున భైరవుడి మందిరం కాపలా కాసే భటుడు, వాడితో పిచ్చాపాటీ మాట్లాడుతూ, "ఇప్పటి నీ జీవితానికీ, మునుపటి జీవితానికీ ఏమైనా తేడా కనబడుతున్నదా ?" అని అడిగాడు.

అందుకు భైరవుడు పెద్దగా నిట్టూర్చి, "ఇదివరకు గొర్రెలను మేపుతూ అడవిలో తిరుగుతున్నా ఎంతో తృప్తిగా వుండేది. ఇప్పుడా తృప్తి లేదుగాని, బతుకు మాత్రం ఒడిదుడుకులు లేకుండా హాయిగా సాగిపోతున్నది. అప్పుడప్పుడూ నాకు, మావాళ్ళ మధ్య తిరగాలనే కోర్కె కలుగుతూంటుంది. అయినా ఏం లాభం, రాజుగారు నన్నిక్కడి నుంచి కదలనివ్వరు !" అన్నాడు.

ఆ జవాబుకు భటుడు పెద్దగా నవ్వి, "నువ్వెంత అమాయకుడివి, భైరవా ! నీ శక్తి ఎలాంటిదో నువ్వు ఎరగవన్నమాట. మాటవరసగా అడుగుతున్నాను, అంత గొప్ప అందాలరాశి అయిన రాకుమారిని



పెళ్ళాడాలని, ఏనాడూ నీ కనిపించ లేదా?'' అని అడిగాడు.

భైరవుడు బెదురుగా చూపులు చూస్తూ, ''బంగారు బొమ్మలాంటి రాకుమారిని పెళ్ళాడాలని ఎవరికుండదు? అయితే, ఆ సంగతి బయటపెడితే మరుక్షణమే రాజుగారు నిలువునా కొరత వేయిస్తారు,'' అన్నాడు.

భటుడు, వాడి భుజం తట్టి, ''నీ నోట వెలువడే మాటకు తిరుగులేదు. ఆ సంగతి రాజుగారికి బాగా తెలుసు. నువ్వు మాత్రం గ్రహించినట్టు లేదు. రేపే రాజుగారిని దర్శించి, రాకుమారిని వివాహమాడ దలచినట్టు చెప్పు. ఒప్పుకపోతే, నీ శక్తి చూపిద్దువుగాని,'' అంటూ ప్రోత్సహించాడు.

భైరవుడి మనసులో కలవరం బయలు దేరింది. వాడు ఆ రాత్రంతా, రాకుమారిని పెళ్ళాడినట్టు కలలుగన్నాడు.

వాడు మర్నాడు రాజును చూడబోయి, తన కోరిక బయటపెట్టాడు.

అది విని రాజు నివ్వెరపోయి, అంతలోనే తెప్పరిల్లి, ''నీవంటి శక్తిశాలి, నాకు అల్లుడు కావడం కంటే గొప్ప అదృష్టమేముంటుంది, భైరవా! భోజనవేళ అయిందికదా, నా సరసన కూర్చుని విందు భోజనం చేద్దువుగాని,'' అన్నాడు.

భైరవుడికి, రాజు పక్కన కూర్చుని తొలిముద్ద తినగానే తల తిరిగినట్టయింది. వాడు ఆసనం మీది నుంచి వెల్లికిలా కింద పడిపోయాడు. రాజు, తనపై విష ప్రయోగం జరిపినట్టు వాడు గ్రహించాడు. వాడికి ఎక్కడలేని చావుభయం పట్టుకున్నది.

వాడు నేల మీద పడిదొర్లుతూ, ''అయ్యో, ఎటువంటి యిక్కట్టు వచ్చింది! గుట్టుగా గొర్రెల్ని మేపుకుంటూ ఊళ్ళో మూగగానే బతికితే, ఎంత బావుండును,'' అన్నాడు.

అంతే — భైరవుడి కోరిక నెరవేరి, ఆ క్షణంలోనే వాడు తన ఊళ్ళో మూగ గొర్రెలకాపరిగా నిలిచాడు.





# కట్నంతంతు

శిళ్ళంగేరి గ్రామంలో కనకరాజనే ఒక మధ్య తరగతి రైతు వుండేవాడు. అతడికి ఒకే ఒక కూమార్తె. ఆమె పేరు సుంద రాంగి. ఆమె చక్కని అందగత్తె. కాని, కొంచెం స్థూలకాయురాలు. ఆ కారణం వల్ల కనకరాజు, ఆమెకు యీడూ జోడూగా వుండే వరుడికోసం వెతకసాగాడు.

కనకరాజుకు నచ్చిన విధంగా, సుంద రాంగికి కొన్ని సంబంధాలు వచ్చాయి. అయితే, వరుడి తరఫువాళ్ళు ఇరవైవేల నుంచి, ముప్ఫైవేలవరకూ కట్నం అడగ సాగారు.

ఈ పరిస్థితుల్లో కనకరాజుకు, గంగా పురంలో వున్న బంగారురాజు గురించి తెలియవచ్చింది.

ఈ బంగారురాజు సామాన్య రైతు. అతడికి చంద్రకాంతరాజనే ఒకేఒక కుమారుడు. కనకరాజు గంగాపురం వెళ్ళి, చంద్రకాంతరాజును చూశాడు. ఆ కుర్ర వాడు గుణవంతుడు; తనకు అల్లుడు కాదగ్గవాడన్న అభిప్రాయం కలిగిం దాయనకు.

వరుడి తండ్రి బంగారురాజు, తన కుమారుడికి ఇరవైవేల కట్నం అడిగాడు. కనకరాజు తన కుమార్తెకు—కట్నానికి సరితూగేట్టు, ఇరవై తులాల బంగారు నగలు పెట్టమన్నాడు. బంగారురాజు అది తన శక్తికి మించిన పని అన్నాడు. కనక రాజు కూడా ఇరవైవేల కట్నం తను యివ్వలేనన్నాడు. అందువల్ల సంబంధం కుదరలేదు.

ఎలాగైనా, యీ సంబంధం కుదుర్చ కోవాలని, అటు కనకరాజుకూ, యిటు బంగారురాజుకూ వున్నది. ఆ పని తాము పెట్టిన షరతులపైనే జరగాలని యిద్దరికీ పట్టుదల కలిగింది.

కోలార్ కృష్ణ అయ్యర్

వాళ్ళిద్దరూ విడివిడిగా, పొరుగూరులో వున్న పేరయ్యశాస్త్రి అనే పెద్ద మనిషిని కలుసుకుని, తమ సంగతి వివరించారు. పేరయ్యశాస్త్రి యిలాంటి సమస్యలను పరిష్కరించడంలో, అతడికి అతడే సాటి.

అయన ఒకనాడు, కనకరాజు దగ్గిరకు వచ్చి, ''కనకరాజూ! నా మాట విని, ఆ బంగారురాజు అడిగిన కట్నం యివ్వడానికి ఒప్పుకో,'' అన్నాడు.

''ఇరవైవేల కట్నమా! అంత శక్తి నాకెక్కడిది శాస్త్రిగారూ. ఆ సంగతి మీకు లోగడే చెప్పాగదా,'' అన్నాడు కనకరాజు.

''నాకా సంగతి తెలియదనుకున్నావా? ఎక్కడైనా అప్పు తీసుకురా,'' అన్నాడు పేరయ్యశాస్త్రి.

''ఆ అప్పు తీర్చడం ఎలా? ఇది కుదిరే పని కాదు,'' అన్నాడు కనకరాజు.

''అది నాకూ తెలుసు. బంగారురాజు, నీ కుమార్తెకు పెట్టే నగలమ్మి, ఆ అప్పు తీర్చు. సరిపోలా!'' అన్నాడు పేరయ్యశాస్త్రి.

పేరయ్యశాస్త్రి తర్వాత బంగారురాజు దగ్గిరకు వెళ్ళి, ''కనకరాజు అడిగిన బంగారు నగలు పెట్టేందుకు ఒప్పుకో,'' అని చెప్పాడు.

బంగారురాజు ఆశ్చర్యంగా, ''నాకా పాటి సామర్థ్యం లేదని తెలిసి, యిలాంటి సలహా యిస్తారెందుకు, శాస్త్రిగారూ!'' అన్నాడు.

''ఆ సంగతి నాకు తెలియంది కాదు. అప్పుచేసి బంగారు నగలు కొని, పెళ్ళికూతురికి పెట్టు,'' అన్నాడు పేరయ్యశాస్త్రి.

''ఆ అప్పు తీర్చాలిగదా! ఎలా సాధ్యం?'' అన్నాడు బంగారురాజు.

''ఆ సంగతి నేనెరగనా! మీ అబ్బాయికి కనకరాజిచ్చే కట్నం డబ్బుతో, ఆ అప్పు తీర్చెయ్యి,'' అన్నాడు పేరయ్యశాస్త్రి.

ఆ తర్వాత ఏ యిబ్బందీ లేకుండా, సుందరాంగి పెళ్ళి చంద్రకాంతరాజుతో జరిగిపోయింది.






## 11

[వింత జలపాతం దాటి వెళ్ళిన వినోదుడు, ముని సహాయంతో అవరోధాలన్నిటినీ అధిగమించి, స్వప్నభూమిని చేరుకున్నాడు. వినోదుణ్ణి అగాధం దాటించి, ముని మాయమయ్యాడు. సంతృప్తశాంతభూమిని చేరుకున్న వినోదుడికి యువరాణి కనిపించి, నీలపర్వతం మీది నక్షత్రఫలం తింటే దేవతదర్శనం సాధ్యమవుతుందని తెలియజేసింది. —తరవాత]

వినోదుడూ, యువరాణీ కూర్చున్నచోటికి ఒక జింక పరిగెత్తుకుంటూ వచ్చింది.

"జింకా, నీలపర్వతం మీది వింత మొక్క, ఈ యేడాది కాయకాసిందేమో చూసి వస్తావా?" అన్నది యువరాణి.

వెంటనే జింక సమీపంలో వున్న ఒక చిన్న కొండ మీదికి ఎక్కి, వెనక కాళ్ళపై నిలబడి చూసింది. కాని, మొక్క జాడ కనిపించలేదు. జింక దూరంగా వున్న ఒక కుందేలును పిలిచింది. కుందేలు జింక తల మీదికి ఎక్కి మొక్క కనిపిస్తుందేమో అని మెడసాచి చూసింది. అయినా కనిపించలేదు. ఇంతలో అటు కేసి ఒక ఉడత వచ్చింది. విషయం తెలుసుకుని, మొక్క జాడ తెలుసుకోవడానికి కుందేలు తల మీదికి ఎగబ్రాకి, ఉత్సాహంగా చుట్టుపక్కల కలయజూసింది. అయినా ప్రయోజనం లేకపోయింది. సమీపంలో

మనోజ్ దాస్



చెట్టు కొమ్మ మీద ఒక పిట్ట కనిపించింది. వెంటనే ఉడత ఆ పిట్టను చూసి, "పిట్టా, పిట్టా, వింతమొక్క కాయ కాసిందేమో చూడు," అన్నది. ఆ పిట్ట కొంత దూరం పైకెగిరి, దూరంగా ఆకాశంలో ఎగురుతూన్న డేగను చూసి, "డేగా, డేగా, వింత మొక్క కాయ కాసిందేమో చూడు," అన్నది.

డేగ అలాగే వెళ్ళి, నీలపర్వతం మీది వింత మొక్క సమీపంలో వాలి, మరు క్షణమే అక్కడి నుంచి మళ్ళీ పిట్ట దగ్గరకు వచ్చి, "వింత మొక్క కాసి ఉన్నది. ఒక్క రోజులో నక్షత్రఫలం పక్వానికి వస్తుంది!" అన్నది.

"అద్భుతం! ఈ రోజు నువ్వు ఇక్కడే గడిపి, రేపు నక్షత్రఫలాన్ని తిని, నీ ప్రయాణం కొనసాగించవచ్చు," అన్నది యువరాణి.

వినోదుడు సరేనన్నట్టు తలాడించాడు. వినోదుడు అక్కడ గడిపిన ఒక్క రోజులోనే ఎన్నో అద్భుతాలను కళ్ళారా చూశాడు. తృప్తి, శాంతి నిండిన భూమి అది అని గ్రహించాడు. ఆ సంతృప్తభూమి వాసులకు అద్భుతశక్తులున్నవి. చంద్రకాంతి నీలంగా వుండాలా? బంగారులా మిలమిలలాడాలా? వెండిలా తళతళలాడాలా? అన్న విషయం వాళ్ళు నిర్ణయించవచ్చు. అక్కడివాళ్ళు అందమైన చిత్రాలను ఊహించి, చిత్రించిన తరవాత వాటికి ప్రాణం పోయగల సమర్థులు! అలా వాళ్ళు ఎన్నెన్నో వినూతన భవనాలను, అందాల తటాకాలను, వింత వింత వృక్షాలనూ, రకరకాల పుష్పాలనూ సృష్టిస్తున్నారు. అయితే అవి శాశ్వతంగా వుండవు. స్వల్ప కాలం మాత్రమే వుంటాయి. అయినా వాళ్ళు సుందర స్వప్నాలుకంటూ వాటికి కుంచెతో రూపం ఇస్తూ, తమ అపూర్వశక్తులతో ప్రాణం పోస్తూ గడపడంలో ఎంతో ఆనందాన్ని అనుభవిస్తున్నారు. అయితే ఒకే ఒక విషయం ఏమంటే—వాళ్ళు ఊహిం

చని విషయాలను మాత్రం సాధించలేరు. ఇందువల్ల వాళ్ళకు ఎటువంటి ఆపదా ముంచుకురాదు. అయినా అనుకోని మంచినీ, పురోభివృద్ధినీ సాధించలేరు. వాళ్ళకు ఒక విధంగా విశ్వాసం అంటే ఏమిటో కూడా తెలియదేమో అనిపించింది వినోదుడికి!

మర్నాడు వేకువజామున యువరాణి వినోదుణ్ణి నీలపర్వతశిఖరం కేసి నడిపించింది. అప్పుడు వినోదుడు ఆమెతో, "సంతృప్తజీవులూ, శాంతస్వభావులూ అయిన మీరు, సాధించలేనివి ఎన్నెన్నో మానవమాత్రులయిన మేము సాధించగలం. అసాధ్యాలను సుసాధ్యాలుగా మార్చడానికి మేము పూనుకోగలం. ఆపదలకు ఎదురీదగలం. అందాలను సృష్టించగలం. అయితే మాకున్న దురదృష్టమంతా— మాకున్న స్వేచ్ఛను దుష్కృత్యాలకు వినియోగిస్తున్నాము. అదే మాలో వున్న బలహీనత; మాపాలిటిశాపం!" అన్నాడు.

"అయితే, కావాలనుకుంటే మనుషులు మంచి వైపు మారవచ్చుకదా?" అని అడిగింది యువరాణి.

"అనుకుంటే మారవచ్చు; అయితే అనుకోవాలికదా! అలా అనుకునే నాథుడెవ్వడు? ముని అన్నట్టు—మానవులు చాలామంది అజ్ఞానాన్నే ఆనందంగా



భావించి, తమ జీవితాలను వెళ్ళబుచ్చుతున్నారు!" అన్నాడు వినోదుడు.

ఆ సమయంలో సూర్యోదయమవుతున్నది. ఆ ప్రాంతమంతా ప్రశాంత గంభీరంగా వున్నది. నీలపర్వత శిఖరం మీద ఉన్న వింతమొక్కకు ఒకే ఒక పండు వేలాడుతున్నది. ఆ పండు నక్షత్రం లాగా మెరుస్తున్నది. యువరాణి దానిని కోసి, వినోదుడికిచ్చి, "నువ్వు చేరుకోవలసిన అవతలిప్రదేశ సరిహద్దు ప్రాంతం ఈ కొండ దిగువ ప్రారంభమవుతుంది. అక్కడ ఎప్పుడూ గాఢాంధకారం అలముకొని వుంటుంది, తుఫానులు చెలరేగుతూ వుంటాయి. ఉరుములూ, మెరుపులతో



ప్రకృతివిలయతాండవంచేస్తూవుంటుంది. నువ్వు ఈ నక్షత్రఫలాన్ని తిని వెళ్ళావంటే, ప్రకృతి నీకెలాంటి హానీ చేయదు. అయితే కొన్ని అమానుష శక్తులు అక్కడ వుంటాయి. నీలో ఏమాత్రం భయం పొడసూపినా నీకు అవరోధాలు కలిగించ డానికి అవి కాచుకుని వుంటాయి. నీలో భయం చోటు చేసుకోనంతవరకు వాటిని గురించి పట్టించుకోనవసరం లేదు. ధైర్యంగా వెళ్ళి, విజయుడివై తిరిగిరా,'' అని చెప్పి వీడ్కోలు పలికింది.

వినోదుడు ఆ పండును తిని ముందుకు నడిచాడు. కొంతదూరం వెళ్ళాక, అతనికి కొండ మధ్య ఒక సన్నటి లోయ కనిపిం చింది. కొండచుట్టూ మేఘాలు కమ్ముకుని వున్నాయి. వినోదుడు మరి కొంతదూరం వెళ్ళి యువరాణి కోసం వెనుకకు తిరిగి చూశాడు. పొగమంచు దట్టంగా కమ్ముకుని వుండడంవల్ల ఆమె అక్కడ వున్నదీ, లేనిదీ కూడా తెలియలేదు. క్రమక్రమంగా పొగమంచు మరీ ఎక్కువై, బారెడు దూరానికి అవతల ఏముందో కూడా తెలియనంత దట్టంగా తయారయింది. మార్గం తిన్నగా వుండడంవల్ల ముందుకు నడవడం వినోదుడికి అంత కష్టంగా లేదు. ఆగి ఆగి మంచుగాలులు బలంగా వీచసాగాయి. వెనువెంటనే కళ్ళు బైర్లు కమ్మేలా మెరుపులు, చెవులు తూట్లు పడేలా ఫెళఫెళారావాలతో బండలను పిండి చేసే పిడుగులు పడసాగాయి. నేరేడుపళ్ళంత వర్షబిందువులు బండలమీద పడి కిందికి దొర్లుకుంటూ రాసాగాయి.

హఠాత్తుగా ఇరువైపులనున్న బండలలో రంధ్రాలుపడి అమితవేగంతో నీళ్ళు చిమ్మసాగాయి. క్షణాల మీద నీళ్ళు మోకాళ్ళ వరకు వచ్చేశాయి. ఇక కొన్ని నిముషాలలో నీళ్ళలో మునిగిపోవడం తథ్యం అని వినోదుడు అనుకుంటూన్న తరుణంలో పెద్ద మెరుపు మెరిసింది. మెరుపు వెలుగులో నీళ్ళ మధ్య ఒక ఎత్తయిన బండవంటి ఆకారం కనిపించింది. ఒక్క

గెంతున వినోదుడు దాని మీదికి ఎగిరి కూర్చున్నాడు. మరుక్షణమే అది లేచి భీకరంగా గర్జిస్తూ పరిగెత్తసాగింది. తను బండ అనుకున్నది ఏదో పెద్ద మృగమని వినోదుడు గ్రహించాడు. అప్పుడప్పుడు మెరుస్తూన్న మెరుపుల వెలుగులో ఆ మృగం బంగారు చాయతో ఉండడం అతడు చూశాడు. పట్టువదిలితే కింద పడి పోగలనని, తన బలం కొద్దీ ఆ మృగాన్ని పట్టుకుని అలాగే వుండిపోయాడు.

కొంతసేపటికి ఆ మృగం వినోదుణ్ణి చిమ్మచీకటి నుంచి లేత వెలుగులోకి తీసుకువచ్చింది. ఆ వెలుగులో చూసి దాన్ని ఒక పెద్ద సింహం అని గ్రహించే లోపుగానే, అతనికి ఎదురుగా కొంత దూరంలో ఆకాశాన్నంటుతున్న భయంకర మైన జ్వాలలతో ఒక నిప్పులగోడ కనిపించింది. "అగు, అగు," అని వినోదుడు కేకలు వేస్తున్నా, సింహం ఆగకుండా అగ్ని కుడ్యం కేసి పరిగెత్తి క్షణంలో దానిగుండా బాణంలా దూసుకుపోయింది. వినోదుడు ఒక్కక్షణం కళ్ళు మూసుకున్నాడు. మరుక్షణమే సింహం నిప్పులగోడను దాటి అవతలికి వచ్చింది. వెంటనే గాలిలోకి విసిరివేయబడినట్టు అతనికి అనిపించింది. కొన్ని క్షణాలలో అతడొక తటాకంలో పడి వుండడం గ్రహించాడు.



నిప్పులగోడను దాటి తనను ఇవతలికి తెచ్చిన సింహం, ఒక తటాకంలోకి తనను విసిరి ఎటో పారిపోయిందని వినోదుడు గ్రహించాడు. పక్కనే ఉన్న నిప్పుల గోడ తటాకంలో ప్రతిబింబిస్తూ తటాక మంతా బంగారుద్రవం ఉన్నట్టు కనిపించింది.

తటాకం మధ్యగా నీళ్ళ పైభాగంలో ఒక వృక్షం కొమ్మలు సాచివుండడం వినోదుడి కంటపడింది. అతడు ఆ వృక్షం కేసి ఈదుకొని వెళ్ళి కొమ్మలపైకి ఎక్కి విపరీతమైన చలితో వణికిపోయాడు. కొమ్మలకు మధ్య చెట్టుబోదెలో అతని కొక తొర్ర కనిపించింది. ఆ తొర్రలో శాస్త



వెచ్చగా వుంటుందికదా అనుకుని అతడు అందులోకి దిగాడు. అంతే, అతడు త్వరగుండా అలాగే దిగబడిపోయాడు. అలా ఎంతదూరం వెళ్ళాడో అతనికి తెలియలేదు. కొంతసేపటికి కింద నిలబడి చుట్టుపక్కలు చూసి అమితాశ్చర్యం చెందాడు. అందమైన పుష్పాలు నిండిన సుందర ఉద్యానవనం మధ్య ఒక దేవాలయం కనిపించింది. తటాకం ఎక్కడ? వృక్షం ఎక్కడ? ఒక చెట్టు తొర్రలో ఇంత సువిశాల ప్రదేశం ఎలా ఇమిడి ఉన్నది?

"ఇందులో అశ్చర్యమేమున్నది?" అన్న ఒక కంఠస్వరం విని, వినోదుడు అటుకేసి తిరిగి చూశాడు.

శాంతస్వభావుడయిన ఒక వృద్ధుడు మందహాసం చేస్తూ దగ్గరికి వచ్చాడు. అయన ఆ దేవాలయ పూజారి అయి వుంటాడని వినోదుడు అనుకున్నాడు. "నా మనసులో ఉన్న అనుమానాలను మీరెలా గ్రహించగలిగారు? అయినా, చెట్టుతొర్ర చిన్న స్థలం కదా! అంత చిన్న స్థలంలో ఇంత పెద్ద ఉద్యానవనం గల సువిశాల ప్రదేశం ఎలా ఇమిడిందన్నదే నా అనుమానం!" అన్నాడు వినోదుడు.

"స్థలానికి సంబంధించినంతవరకు చిన్నస్థలం, పెద్దస్థలం అంటూ ఏదీ లేదు. స్థలాన్ని మీరెలా కొలుస్తారు?" అని అడిగాడు పూజారి.

"ఒక అడుగు, రెండు అడుగులు అని కొలబద్దతో కొలుస్తాము," అన్నాడు వినోదుడు.

"అలా మీరు కొలిచేది కొలబద్దనేకాని స్థలాన్ని కాదు. స్థలం అభిన్నం, అఖండం; దాన్ని విడిగా కొలవడం సాధ్యం కాదు. ఆలోచించిచూడు, అర్థమవుతుంది," అన్నాడు పూజారి.

పూజారి మాటలలో నిజం ఉన్నదనిపించింది వినోదుడికి.

"అయినా, నా మనసులోని ఆలోచనలను మీరెలా గ్రహించగలిగారు?" అని అడిగాడు వినోదుడు.

''ఇక్కడ ప్రత్యేకించి నీ ఆలోచన, నా ఆలోచన అంటూ ఏదీలేదు. ఈ దివ్య ప్రదేశంలో ఎదుట వున్న మనిషిని చూసి నట్టే, అతనిలోని ఆలోచనలను కూడా స్పష్టంగా చూడవచ్చు. ఇంతెందుకు? నా మనసులోని భావాలను కూడా నువ్వు చూడవచ్చు. కావాలంటే ప్రయత్నించి చూడు,'' అన్నాడు పూజారి.

వినోదుడు, పూజారి మనసులో ఏము న్నదో తెలుసుకోవాలన్న ఉద్దేశంతో ఆయన కేసి చూశాడు. ఆ క్షణమే ఆ వృద్ధపూజారి మనసులో వున్న భావాలన్నీ వినోదుడికి తెలిసిపోయాయి.

''ఈ ఆలయంలోని దేవత దర్శనం కోసమే నేనింతదూరం ప్రయాణం చేసి వచ్చానని మీరు నాకు తెలియ జెప్ప నున్నారు. నేను మూడు వరాలు మాత్రమే కోరాలని చెప్పడానికి మీరు ఆశిస్తున్నారు. అంతేకదా!'' అన్నాడు వినోదుడు.

''అవును. అయినా, అది నీకు అంత సంతోషాన్ని కలిగించడం లేదు. ఎందు కంటే, నువ్వు నాలుగు వరాలు కోరాలన్న ఆశతో వున్నావు!'' అన్నాడు వృద్ధపూజారి.

''అవును. నిజమే,'' అన్నాడు వినోదుడు.

''అయితే, అది సాధ్యం కాదు. మూడు వరాలే పరిమితం. ఈసందర్భంలో నువ్వొక విషయం గుర్తించాలి. సృష్టిలో ప్రతి దానికీ ఒక పరిమితి అంటూ వుంటుంది. ఆ పరిమితి కొక కారణమూ, న్యాయమూ వుంటాయి. సింహం నిన్ను వీపు మీద మోస్తూ పరిగెత్తినప్పుడు నీ మదిలో కాస్త భయం మెదిలింది. అయినా సింహం అలా చేయకుండా వుంటే నువ్వు నిప్పుల గోడను దాటి వుండేవాడివా? అదే విధంగా చెట్టు తొర్రలో దిగబడిపోయినప్పుడు నీలో నిస్పృహ కలిగింది. అయితే, అలా దిగ కుండా వుండి వుంటే నువ్విక్కడికి చేరే వాడివేనా? ఆలోచించు,'' అన్నాడు పూజారి.

నిజమే అన్నట్టు వినోదుడు తలాడించాడు.

—(ఇంకావుంది)






# అపూర్వకిరీటం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా పట్టుదలతో అర్ధరాత్రివేళ, ఈ శ్మశానంలో తిరుగుతూ, నువ్వు సాధించ దలచిన దేమైనా, అది సాధించాక తప్పక సత్ఫలితాలిస్తుందని మాత్రం భ్రమించకు. ఎందుకంటే, మహిమలూ, మానవాతీత శక్తుల్లాంటివి మేలుకే కాక, కీడుకూ దారి తీయవచ్చు. ఇందుకు ఉదాహరణగా, దేవగుప్తుడనేవాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం హంసగిరి అనే రాజ్యంలో, నందగుప్తుడనే వృద్ధుడుండేవాడు. ఆయనకు దేవగుప్తుడనేవాడు ఏకైక

## బేతాళ కథలు



సంతానం. నందగుప్తుడి దగ్గిర ఒక అపూర్వమైన కిరీటం వుండేది. అది జాతిరత్నాలతో పొదగబడి కాంతులు వెదజల్లుతుండేది.

దేవగుప్తుడు సహజంగా తెలివైనవాడు; విద్యాబుద్ధులు నేర్చినవాడు. అతడికి ఏదైనా వ్యాపారం చేసి ధనం గడించాలన్న కోరిక వుండేది. అయితే, తండ్రితోపాటు నిత్యదారిద్ర్యంతో బాధపడుతున్న అతడికి, అది సాధ్యపడలేదు.

ఒకనాడు దేవగుప్తుడు, తండ్రిని, "నీ ఉద్దేశం ఏమిటో, నాకు అంతుబట్టడం లేదు. వేలకువేలు ఖరీదు చేసే విలువైన కిరీటం దగ్గర వుంచుకుని, మనం ఇలా తిండికి కటకటలాడడం ఎందుకు?" అని అడిగాడు.

దానికి నందగుప్తుడు, "బాబూ, అది మామూలు కిరీటం కాదు, అమ్మి డబ్బు చేసుకునేందుకు. దాని రహస్యం చెబుతాను, విను. ఎవరైనాసరే, ఆ కిరీటాన్ని పెట్టుకుని, రాజోచితమైన దుస్తులు ధరించి, రాజును దర్శిస్తే—కిరీటం మహిమవల్ల, రాజు మారుమాట్లాడకుండా యువరాణితో వివాహం జరిపిస్తాడు. నా తరంలో రాజుకు అల్లుడు కావడం సాధ్యపడలేదు. అనేకమైన ఈతిబాధలతో కాలం దొర్లిపోయింది. ఎంతో ధనం వెచ్చించితేగాని రాజోచితమైన దుస్తులూ, కంఠహారాలూ లభ్యం కావు గదా! కనీసం నిన్నయినా రాజుగారి అల్లుణ్ణి చేయాలని, కిరీటాన్ని భద్రంగా దాచి వుంచాను," అని చెప్పాడు.

ఈ రహస్యం తెలిశాక, దేవగుప్తుడికి ఒక ఆలోచన వచ్చింది. కిరీటాన్ని అమ్మి, ఆ డబ్బుతో మంచి లాభసాటి వ్యాపారం ఏదైనా చేసి, మళ్లీ కిరీటాన్ని కొనవచ్చు గదా! ఇందువల్ల, కిరీటంతోపాటు డబ్బు కూడా సంపాయించి, రాజోచితమైన దుస్తులు ధరించి, యువరాణిని వివాహమాడవచ్చు. కాని, తండ్రి కిరీటాన్ని అమ్మేందుకు ఒప్పుకోడు!

కొన్నాళ్ళ తర్వాత, వృద్ధుడైన నంద గుప్తుడు మరణించాడు. దేవగుప్తుడు కిరీటాన్ని, ఒక శ్రీమంతుడికి కోరినప్పుడు తిరిగి అమ్మే షరతు మీద, పదివేల వరహా లకు అమ్మి, ఆ ధనంతో సముద్రవర్తకం ప్రారంభించాడు. అప్పటివరకూ సముద్ర వర్తకంలో పోటీ లేకుండా నెట్టుకు వస్తున్న మేఘనాథు డనే వాడికి, దేవ గుప్తుడి రంగప్రవేశం పెద్ద ప్రతిబంధక మైంది. అంచెలంచెలుగా విస్తరిస్తున్న దేవగుప్తుడి వ్యాపారదక్షతకు తట్టుకోలేక, మేఘనాథుడు సముద్రవర్తకానికి స్వస్తి చెప్పి, రత్నాలవర్తకం ఆరంభించవలసి వచ్చింది.

త్వరలోనే దేవగుప్తుడు ఇరవైవేల వరహాలు ఆర్జించి, శ్రీమంతుణ్ణి కలుసు కుని, "మన షరతు ప్రకారం పదివేల వరహాలు తీసుకుని, నా కిరీటం యివ్వండి," అని అడిగాడు.

అందుకు శ్రీమంతుడు నవ్వి, "పదివేల వరహాలకుగాను యింత కాలానికి వడ్డీ ఎంత అయిందో లెక్కకట్టు. దానికి వేరే నా లాభం కొంత చేర్చాలిగదా! మొత్తం పాతికవేలవరహాలు యిచ్చి, నీ కిరీటం తీసుకుపో," అన్నాడు.

చేసేదిలేక దేవగుప్తుడు తిరిగి వచ్చి, యీసారి రెట్టింపు లాభాలు తెచ్చిపెట్టే



రత్నాలవర్తకం ఆరంభించాడు. దేవ గుప్తుడు, యీ వర్తకంలో కూడా పోటీ వచ్చేసరికి, మేఘనాథుడు ఆగ్రహించి దేవగుప్తుడి మీద కక్ష సాధించదలిచాడు.

దేవగుప్తుడు ముప్పైవేలవరహాలు సంపాదించుకుని, మరొకసారి శ్రీమంతుణ్ణి కలిశాడు. శ్రీమంతుడు అతడితో, "నువ్వు ఎంతకూ కిరీటం కోసం రాకపోయేసరికి, దాన్ని తిరిగి తీసుకునే ఆలోచన లేదను కుని, మేఘనాథుడికి ముప్పైవేల వరహా లకు అమ్మేశాను," అన్నాడు.

దేవగుప్తుడు, మేఘనాథుడి దగ్గిరకు పోయి, "ఆ డబ్బు తీసుకుని, కిరీటం నాకు యిచ్చెయ్యండి," అని అడిగాడు.



మేఘనాధుడు ఆశ్చర్యపోయి, "పది వేలవరహాల విలువచేసే కిరీటం కోసం, నీ పాకులాట చూస్తూంటే, ఆ కిరీటం వెనక ఏదో గొప్ప రహస్యం వున్నదన్న అనుమానం కలుగుతున్నది. అదేమిటో చెప్పు," అని అడిగాడు.

"నువ్వు కిరీటం కోసం, ఏమడిగినా యిస్తానుగాని, ఆ రహస్యం మాత్రం చెప్పను," అన్నాడు దేవగుప్తుడు.

మేఘనాధుడు ఒకటి, రెండు క్షణాలు ఆలోచించి, "అయితే, నీ సంపద అంతా వదిలేసి కట్టుబట్టలతో వెళ్ళిపోతావా, కిరీటం యిచ్చేస్తాను ?" అన్నాడు.

ఆ కిరీటం సాయంతో, యువరాణిని పెళ్ళాడవచ్చునన్న ఆలోచనలో వున్న దేవగుప్తుడు, దానికి అంగీకరించి, తన యావదాస్తినీ మేఘనాధుడికి ధారాదత్తం చేసి కిరీటం తీసుకున్నాడు.

తర్వాత అతడు, తాను ఎరిగినవాళ్ళ నుంచి కొంత డబ్బు అప్పు తీసుకుని, రాజోచితమైన దుస్తులు ధరించి, కిరీటం పెట్టుకుని రాజును కలుసుకోవాలను కున్నాడు. అయితే, అదేమి చిత్రమో గాని—దేవగుప్తుడికి చిల్లిగవ్వ కూడా అప్పు పుట్టలేదు. అంతేకాక, దినదినానికీ అతడి పరిస్థితి దిగజారి, పూటగడవనిస్థితికి చేరుకున్నాడు.

"అదెలా వీలవుతుంది, దేవగుప్తా ? మనం చేసేది రెట్టింపు లాభాలు వచ్చే రత్నాలవ్యాపారం కదా. నా పెట్టుబడికి రెట్టింపు యిచ్చి, కిరీటం తీసుకో," అన్నాడు మేఘనాధుడు.

మేఘనాధుడు తనపై కక్ష కట్టాడని గ్రహించి, దేవగుప్తుడు అప్పటికప్పుడే ఊరువిడిచి వెళ్ళి, చేతికందిన వ్యాపారాలు చేసి అచిరకాలంలోనే లక్షలార్జించి తిరిగి వచ్చాడు.

అతడు మేఘనాధుడి వద్దకు పోయి, "లక్షవరహాలు తీసుకుని కిరీటం యివ్వ డానికి, నీకెలాంటి అభ్యంతరం లేదను కుంటాను," అన్నాడు.

ఈ స్థితిలో దేవగుప్తుడు బాగా ఆలోచించి, మేఘనాధుణ్ణి కలుసుకుని, "ఈ కిరీటం రహస్యం చెప్పి, నీకిచ్చి పోదామని వచ్చాను. దీన్ని పెట్టుకుని, రాజోచితమైన వస్త్రాలు ధరించి రాజును కలుసుకుంటే, కిరీటం మహిమవల్ల, ఆయన యువరాణితో నీకు వివాహం జరిపిస్తాడు. దయచేసి, నువ్వు కిరీటం తీసుకుని కొంత డబ్బు యిచ్చావంటే, ఏదైనా వ్యాపారం చేసుకుని బతుకుతాను," అని ఎంతో దీనంగా అడిగాడు.



మేఘనాధుడు కిరీటం తీసుకుని, "నీకు డబ్బు యిచ్చానంటే, వ్యాపారంలో నాకే పోటీ అవుతావు. మర్యాదగా యిక్కణ్ణించి వెళ్ళిపో. లేదంటే, నా మనుషులతో చావచితక కొట్టిస్తాను," అన్నాడు.

దేవగుప్తుడు అన్నివిధాలా బలహీనుడు గనక, మేఘనాధుడికి భయపడి, వెంటనే ఊరువదిలి వెళ్ళిపోయాడు. అతడు మరొక ఊరు చేరి, అక్కడ ఎలాగో తిప్పలుపడి అప్పుచేసి వ్యాపారం మొదలు పెట్టాడు. కొద్దికాలంలోనే అతడి వ్యాపారం మూడు పువ్వులూ, ఆరు కాయలుగా పరిణమించింది.

ఒకనాడు దేవగుప్తుడి వద్దకు, ఒక బికారి వచ్చి, "దేవగుప్తా, నేను మేఘనాధుణ్ణి. కాలం కలిసిరాక అంతా పోగొట్టుకుని, యిలా బికారినైపోయాను. నిన్ను గురించి విని, కిరీటం యిచ్చిపోదామని వచ్చాను. దీన్ని తీసుకుని నువ్వయినా, యువరాణిని పెళ్ళి చేసుకుని సుఖించు," అన్నాడు.

అందుకు దేవగుప్తుడు, "కిరీటం నీ దగ్గిరే వుంచుకో, నాకు వద్దు!" అని చెప్పి, మేఘనాధుణ్ణి పంపేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, అపూర్వకిరీటం రహస్యం చెప్ప నిరాకరించి, సర్వం పోగొట్టుకున్న దేవగుప్తుడు, చివరకు దాని రహస్యం మేఘనాధుడికి చెప్పి, ఎందుకు కిరీటాన్ని వదులు

కున్నాడు? దేవగుప్తుడి జీవితాశయం, అపూర్వకిరీటం సాయంతో యువరాణిని పెళ్ళాడాలనేకదా? అటువంటప్పుడు కోరి వచ్చి, కిరీటం తీసుకోమని అడిగిన మేఘనాధుణ్ణి, దేవగుప్తుడు ఎందుకు తిరస్కరించాడు? కిరీటం యొక్క దుష్టప్రభావం వల్ల, మొదట నందగుప్తుడూ, తర్వాత దేవగుప్తుడూ, చివరకు మేఘనాధుడూ దరిద్రులయ్యారనుకుంటే — కిరీటాన్ని కొన్న శ్రీమంతుడి మాటేమిటి? ఆయనకు ఎలాంటి నష్టం వాటిల్లలేదుగదా. ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "అపూర్వ కిరీటం చిత్రమైన మహిమో లేక దుష్ట ప్రభావం కలదిగానో కనిపిస్తున్నది. దాన్ని చేబట్టినవాడు, రాజోచితమైన వస్త్రాభరణాలు సంపాయించుకుని యువరాణిని పెళ్ళాడటం జరగనిపని అన్న మాట. ఈ విషయం అనుభవం ద్వారా తెలుసుకున్న దేవగుప్తుడు, తన మీది కక్షతో, తన సంపదనంతా దోచి దరిద్రుణ్ణి చేసిన మేఘనాధుణ్ణి దెబ్బతియ్యాలని, అతడికి దాని రహస్యం చెప్పి అంటగట్టాడు. దాని ప్రభావంవల్ల సర్వం కోల్పోయిన మేఘనాధుడు, విషయం గ్రహించి, దాన్ని తిరిగి దేవగుప్తుడికిచ్చి, అతణ్ణి దరిద్రుణ్ణి చేయాలని చూశాడు. అనుభవం నేర్పిన పాఠంతో దేవగుప్తుడు, మేఘనాధుడి నుంచి కిరీటం తీసుకో నిరాకరించాడు.

ఇక, దేవగుప్తుడి నుంచి కిరీటం కొన్న శ్రీమంతుడూ, శ్రీమంతుడి నుంచి మొదటి సారి కిరీటం తీసుకున్న మేఘనాధుడూ నష్టపడకపోవడానికి కారణం, వాళ్ళకు కిరీటం రహస్యం తెలియకపోవడమే. అంటే—రహస్యంతెలిసినవాణ్ణి మాత్రమే, అది దరిద్రుణ్ణి చేస్తుందని అర్థమవుతున్నది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# అజ్ఞాతపండితుడు

చీనాలో విద్వాంసులు పరీక్షలకు కూర్చుని, వాటిలో ఉత్తీర్ణులై, ప్రభుత్వోద్యోగాలు సంపాదించుకునే వారు. పదిహేడు శతాబ్దాల క్రితం ఒక గ్రామంలో పావో స్వాన్ అనే యువకుడైన విద్వాంసుడు పరీక్షకు కూర్చుందామని రాజధానికి బయలుదేరాడు. దారిలో అతనికి మరొక యువకవిద్వాంసుడు తటస్థపడ్డాడు.

ఈ కొత్త యువకుడు గుండెనొప్పితో బాధపడుతూ ఉండటం చూసి పావో ఆగి, అతనికి సహాయపడబోయాడు. కాని పావో కృషి వృథా అయింది. గుండె పోటుతో బాధపడుతున్న విద్వాంసుడు త్వరలోనే మరణించాడు.

చనిపోయిన యువకుడి పేరేమిటో పావోకు తెలియదు. అతని వద్ద పది వెండి కాసులూ, రచనలతో కూడిన కాగితపు చుట్టా ఉన్నాయి.

పావో ఆ కాగితపు చుట్టను శవం మీద కప్పి, ఒక వెండి కాసుతో శవానికి ఉత్తర క్రియలు జరిపి, శవం తల కింద మిగిలిన వెండి కాసులు పెట్టి, శవ పేటికతో సహా, శవాన్ని పాతేయించాడు.

అతను చనిపోయిన వాడికి అశ్రు తర్పణం విడిచి, "చనిపోయిన నీకు చాతనైతే, నీ వారికి నువు ఎక్కడ ఉన్నదీ తెలియబరుచుకో. నేను తొందర పని మీద వెళుతున్నాను. నీకోసం నేనేమీ చేయ లేను," అని చెప్పి ప్రయాణం సాగించాడు.

అతను రాజధాని చేరి పరీక్షలకు కూర్చుని, వాటిలో ఘనంగా ఉత్తీర్ణుడైనాడు. అతని పేరు చాలా దూరం పాకింది.

పావో రాజధానిలో ఉండగా ఒక వింత జరిగింది. ఎవరిదీ కాని గుర్రం ఒకటి పావోను ఆశ్రయించింది. అది పావోను విడిచిపెట్టకపోగా, ఇతరులను ఎంత

చీనా జానపద కథ

మాత్రమూ దగ్గిరికి రానివ్వకపోయింది. గత్యంతరం లేక పావో దాన్ని తన సొంతం చేసుకున్నాడు.

అతను రాజధాని నుంచి స్వగ్రామానికి తిరిగి వస్తూ దారి తప్పాడు. చీకటి పడబోయే సమయంలో అతనికి ఒక కులీనుల భవంతి కనబడింది. ఆ రాత్రికి ఆ యింట తాను తల దాచుకునేటందుకు అవకాశం దొరుకుతుందేమో తెలుసుకుందామని పావో తన పేరు గల కాగితాన్ని ఇంటి నౌకరు కిచ్చి, "అయ్యగారి దర్శనం కోరానని చెప్పు," అన్నాడు.

ఆ నౌకరు గుర్రాన్ని పరీక్షగా చూసి, లోపలికి వెళ్లి, ఇంటి యజమానికి కాగితం ఇస్తూ, "బాబుగారూ, ఈ చీటీ ఇచ్చిన మనిషి మన పోయిన గుర్రాన్ని కాజేసినవాడే!" అన్నాడు.

ఇంటి యజమాని కాగితం మీద, "పావో స్వాన్" అనే పేరు చూసి, "ఈయన గొప్ప పండితుడు. లోపలికి తీసుకురా!" అని నౌకరుతో అన్నాడు.

పావో లోపలికి వచ్చినాక ఆయన, "కిందటేడు నేను పోగొట్టుకున్న గుర్రం మీకు ఎలా దొరికింది?" అని అడిగాడు.

"నేను రాజధానికి వెళ్ళేటప్పుడు దారిలో నా కొక విద్యాంసుడు తటస్థపడ్డాడు. అతను గుండె నొప్పితో మరణించాడు," అంటూ పావో తన కథ అంతా గృహయజమానికి వివరంగా చెప్పాడు.

గృహయజమాని "వాడు నా కొడుకే అయి వుండాలి!" అన్నాడు.

ఆయన మర్నాడు బయలుదేరి వెళ్ళి, పాతినచోటు నుంచి శవ పేటికను తవ్వి తీసిచూస్తే, చనిపోయిన ఆయన కొడుకే నని తేలింది. పావో చెప్పినట్టుగానే శవం మీద కాగితం చుట్టి కప్పి ఉన్నది. శవం తలకింద వెండి కాసులు కూడా ఉన్నాయి.

పావో తన కొడుకు పట్ల చూపిన శ్రద్ధకు ఎంతో సంతోషించి, ఆ కులీనుడు ఆస్థానానికి వెళ్ళి, పావోను గట్టిగా శిఫార్సు చేశాడు. పావో ఉన్నత న్యాయాధికారిగా పని చేసి గొప్ప కీర్తి తెచ్చుకున్నాడు.





కావ్యకథలు:

# మణిమంజీరం-1

దాదాపు రెండువేల సంవత్సరాలకు పూర్వం, కావేరీనది సముద్రంలో సంగమించేచోట పూంపుహార్ అనే పట్టణం వుండేది. చోళులకు రాజధానీనగరమైన పూంపుహార్‌లో అనేక దేవాలయాలూ, భవనాలూ వుండేవి.

చోళరాజులు ధర్మపరిపాలన జరిపారు. కళలను పోషించారు. ప్రజలు ఎటువంటి కొరతా లేకుండా హాయిగా జీవించారు. భారతదేశం నుంచే కాకుండా, గ్రీసు, రోము మొదలైన విదేశాల నుంచి కూడా ఎందరెందరో పండితులూ, రాయబారులూ చోళరాజుల దర్శనానికి వచ్చేవారు.






సుదూరప్రాంతాల నుంచి ఓడలు పూంపుహార్ రేవుకు వచ్చేవి. ఆ సుసంపన్ననగరంలో వున్న నిజాయితీపరులైన వ్యాపారులతో వర్తకవ్యాపారాలు జరపడానికి దేశవిదేశ వర్తకులు ఎంతో ఉత్సాహం చూపేవారు.



పూంపుహార్‌నగర వీధులలో రత్నాలు, మణులు, మాణిక్యాలు రాసులుగా పోసి వ్యాపారం సాగించేవారు. నగరం సిరిసంపదలతో తులతూగేది.

ఆ నగరంలోని ఒక భవంతిలో మానాయ్‌కన్ అనే ఓడల వర్తకుడు నివసించేవాడు. ఆయనకు కణ్ణగి అనే కుమార్తె వుండేది. ఆమె అందచందాలలో లక్ష్మీదేవి లాగా వున్నదని అందరూ చెప్పుకునేవాళ్ళు. ఆమె ఎంతో గుణవంతురాలు.





వాళ్ళ ఇంటికి సమీపంలోనే సంపన్నుడయిన మాసాత్తువాన్ అనే మరొక వర్తకుడు వుండేవాడు. ఆయన కుమారుడు కోవలన్ మంచి అందగాడు, గుణవంతుడు. పేదసాదలకు దానధర్మాలు చేయడంలో ఎంతో ఆసక్తిని చూపేవాడు.

మానాయకన్, మాసాత్తువాన్ ఇరువురూ మంచి స్నేహితులు. ఒకరితో ఒకరు వియ్యమందితే మరీ బావుంటుందని భావించి కణ్ణగి, కోవలన్‌లకు వివాహం జరిపించాలని నిర్ణయించారు. వాళ్ళ నిర్ణయాన్ని బంధుమిత్రులందరూ ఎంతగానో కొనియాడారు.





పెద్దలు వివాహముహూర్తం నిర్ణయించారు. బాజాభజంత్రీలతో, మేళతాళాలతో వధూవరులను ఊరేగింపుగా కల్యాణ మండపానికి తీసుకు వచ్చారు.

పురోహితులు వేదమంత్రాలు పఠిస్తూండగా, వధూవరులయిన కణ్ణగి—కోవలన్ అగ్నిప్రదక్షిణం చేశారు. వివాహ మహోత్సవానికి వచ్చిన ముత్తయిదువలు వధూవరులను పుష్పాలతోనూ, సుగంధద్రవ్యాలతోనూ ఆశీర్వదించారు.





ఇంటికి వచ్చినవారిని ఆదరిస్తూ, గృహస్థ ధర్మాలను చక్కగా నిర్వర్తించడానికి అనువుగా, నూతన వధూవరులకు కోవలన్ తల్లి ఒక ప్రత్యేక భవనాన్ని నిర్మించి ఇచ్చింది. కణ్ణగి—కోవలన్ దంపతులు హాయిగా జీవించసాగారు.

ఆ నగరంలోనే మరొకచోట అందాల భరిణ అయిన మాధవి అనే నాట్యకత్తె వుండేది. ఆమె శ్రేష్ఠులయిన గురువుల నుంచి నాట్యకళను భక్తిశ్రద్ధలతో నేర్చుకున్నది.






నాట్యాభ్యాసం పూర్తయ్యాక, మాధవి ఒకనాడు పురప్రముఖులందరినీ రప్పించి, వారి సమక్షంలో తన నాట్యకళా విన్యాసం ప్రదర్శించడానికి ప్రారంభించింది. —(ఇంకావుంది)



# నీతిబోధన

సుధాకరుడనే అతడికి, రాజాస్థానంలో మంచి ఉద్యోగం వున్నది. అతడికి బంధు ప్రీతి ఎక్కువ. అందువల్ల, ఒకసారి సెలవు దొరగ్గానే పల్లెటూరిలోని, తన చిన్నతాతగారింటికి వెళ్ళాడు. చిన్నతాత గారి పెద్దకొడుకు గోపాలుడు, గురుకులంలో పెద్ద చదువులు చదివినా, ఇంటి దగ్గిరే వుండి వ్యవసాయం చూసుకుంటున్నాడు.

సుధాకరుడిలో వినయం పాలెక్కువ. పెద్దలను గౌరవిస్తాడు. తనను గురించి గొప్పలు చెప్పుకోడు. తనకు వీలైనంతలో చుట్టుపక్కలవారికి సాయం చేస్తాడు.

అతడి చిన్నతాత, సుధాకరుణ్ణెంతగానో మెచ్చుకుని, ''పట్టణంలో వుంటూ పెద్ద ఉద్యోగం చేస్తూ కూడా, నువ్విలా వున్నావు. గోపాలుడలా కాదు. ఊళ్లో ఎవరితోనూ వాడికి పడదు. అస్తమానం ఇంట్లో అందర్నీ దేనికోదానికి తప్పుపడుతూనే వుంటాడు. మేము చెబితే వినడు. నువ్వు కాస్త చెప్పిచూడు, నాయనా!'' అన్నాడు.

ఆసాయంత్రం సుధాకరుడు, గోపాలుణ్ణి మాటల్లోకి దించి సంగతి సందర్భాలన్నీ తెలుసుకున్నాడు.

ఆ ఊళ్లో వ్యవసాయం చేస్తున్నవాళ్లల్లో, గోపాలుడొక్కడే బాగా చదువుకున్నవాడు. అందుకని, అందరూ తనను ప్రత్యేకంగా గౌరవించాలంటాడు. అతడికి వ్యవసాయంలోని మెలకువలన్నీ తెలుసు. ఆ కారణంగా, అందరూ తనను పొగడాలంటాడు. అతడు ఎన్నడూ ఎవరికీ సాయపడడు. అయినా అవసరం కలిగినప్పుడు, అందరూ తనకు సాయపడాలంటాడు. ఎదుటివాళ్ళకు కష్టం వస్తే, గోపాలుడు వాళ్ళను వేళాకోళం చేస్తాడు. తనకు

"వసుంధర"

కష్టం వస్తే, అంతా తనను ఓదార్చాలం టాడు. ఎదుటివాళ్ళు బాగుపడితే, అత డోర్వలేడు. కానీ, అందరూ తను బాగు పడితే సంతోషించాలంటాడు. ఎదుటి వాళ్ళల్లో లోపాలుంటే నిర్మొహమాటంగా చెప్పి కించపరిచే గోపాలుడికి, ఎవరైనా తన లోపం చెబితే పట్టరాని కోపం వస్తుంది.

''గోపాలా, తప్పంతా నీలోనే వున్నది. ముందు నీలో నువ్వు, సహనం, మంచి తనం పెంచుకోవాలి. అప్పుడు నువ్వు, నీ చుట్టుపక్కలవాళ్ళలో గొప్పతనాన్నీ, మంచితనాన్నీ చూడగలుగుతావు. అప్పుడు వాళ్ళూ నిన్ను గౌరవిస్తారు,'' అన్నాడు సుధాకరుడు.

ఇది విని గోపాలుడు, ''అయితే, యింతకూ నువ్వనేదేమిటి?'' అన్నాడు కోపంగా.

''నీలో అహంకారం, ఆశ, స్వార్థం, చిలిపితనం, అసూయ, కోపం, లోభం వంటి చెడ్డగుణాలు చాలా వున్నాయి. వాటిని వదిలిపెట్టు. ప్రపంచమంతా నీకు మంచిగా తోస్తుంది,'' అన్నాడు సుధా కరుడు.

ఈ మాటలకు గోపాలుడికి మరింతగా కోపం వచ్చింది. ''మా ఇంటికి అతిథిగా వచ్చావు కాబట్టి కానీ—ఇవే మాటలు మరింకొకళ్ళెవరైనా అంటే, పళ్ళు రాల గొట్టేవాణ్ణి. నీతులు వినడం నాకు చాలా అసహ్యం!'' అన్నాడు.



అందుకు సుధాకరుడు బాధపడినప్పటికీ, గోపాలుడి వంటి వాడికి నీతులు చెప్పాలనుకున్నతప్పుకు, తనకాశిక్ష తగునని సరిపెట్టుకున్నాడు.

మరసటిరోజా ఊరికి మహానందస్వామి అనే యోగి వచ్చాడు. ఆయన వేదాంత సారాన్ని ఊరూరా తిరిగి ప్రజలకు బోధిస్తూంటాడు. ఆ రాత్రి ఊరి గుడి ఆవరణలో అందుకు ఏర్పాటు జరిగింది.

సుధాకరుడికి ఇలాంటి వాటిల్లో ఆసక్తి లేక, తను రానన్నాడు. అయితే గోపాలుడు, అతడితో, "మొదటి రోజున మన ఇంట్లో వాళ్ళందరూ, స్వామీజీ బోధలు వినేందుకు వెళ్ళి తీరవలసిందే. మనకు ముందు వరసలో కూర్చునేందుకు ఏర్పాటుంటుంది. ఊరు పెద్దల్లో మనంముఖ్యులం!" అన్నాడు.

దానితో సుధాకరుడికి వెళ్ళడం తప్పని సరి అయింది.

ప్రజలంతా వచ్చాక స్వామీజీ ఉపన్యాసం ప్రారంభమయింది. ఆయన సత్ప్రవర్తన గురించి మాట్లాడుతూ—సరిగ్గా సుధాకరుడు, గోపాలుడికి చెప్పిన మాటలే చెప్పాడు. అది విన్న సుధాకరుడు కొంచెం భయపడ్డాడు—గోపాలుడు కోపం తెచ్చుకుని స్వామిజీని నిందిస్తాడేమోనని!

స్వామీజీ ఉపన్యాసం, అందరూ శ్రద్ధగా విన్నారు. ఆయన నలుగురికీ అర్థమయ్యే పిట్టకథలను ఉదాహరణగా యిస్తూ, ఎన్నో గొప్ప విశేషాలు చెప్పాడు.



అయితే అవన్నీ కూడా సూటిగా గోపాలుణ్ణి ఉద్దేశించి చెప్పినట్లుండడంవల్ల, తర్వాత ఆయన ఉపన్యాసాన్ని మెచ్చుకునేందుకు సుధాకరుడు భయపడ్డాడు.

అయితే, ఇంటికి వెళ్ళాక గోపాలుడు, స్వామీజీ ఉపన్యాసాన్ని విపరీతంగా మెచ్చుకుని, సుధాకరుడితో, "మనం రోజూ స్వామీజీ ధర్మబోధలు వినేందుకు వెళదాం. అవి ముగిసేవరకూ నువ్విక్కడే వుండాలి," అన్నాడు.

తను చెప్పిన మాటలకు, గోపాలుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. అవే మాటలు స్వామీజీ చెబితే కోపం రాలేదు సరికదా—విపరీతంగా మెచ్చుకున్నాడు. అంటే, తనలో లేని విశేషమేదో స్వామీజీలో వున్నది. అది ఏమిటో తెలుసుకోవాలని సుధాకరుడు మర్నాడు స్వామీజీని కలుసుకుని, ఏకాంతంలో తన సందేహం వెలిబుచ్చాడు.

మహానందస్వామి మందహాసం చేసి, "నాయనా, ఏ మనిషీ తనలో తప్పులున్నాయనుకోడు. అంతేకాక, ఉన్నవి తెలుసుకోవాలనుకోడు. అలా తెలియచెప్పాలనుకోవడం, నువ్వు చేసిన తప్పు. ఇక నా సంగతంటావా! నేను పదిమందికీ పనికి వచ్చే పరమార్థం చెబుతున్నాను. ప్రత్యేకంగా ఎవ్వరికీ నీతులు చెప్పడం లేదు. నేను మాట్లాడేటప్పుడు అందరూ, నేనెంత గొప్పగా చెబుతున్నానా అని ఆలోచిస్తారు తప్ప, నా మాటలు తమకు అన్వయించుకుని చూసుకోరు. ఒక్క ముక్కలో చెప్పాలంటే—నేను అందరికీ కలిపి నీతులు చెప్పాను. అందువల్ల, అవి గోపాలుణ్ణి బాధించవు. నువ్వు అలాకాక, గోపాలుడి కొక్కడికే నీతులు చెప్పావు. అవి అతణ్ణి బాధిస్తాయి. ఇప్పుడు అర్థమయిందా?" అన్నాడు.

స్వామీజీ ఇలా వివరించి చెప్పగానే, సుధాకరుడికి మనుషుల మనస్తత్వం చక్కగా అర్థమయింది. అతడు, ఆయనకు నమస్కరించి సంతోషంగా ఇంటికి తిరిగి వెళ్ళాడు.





# కృష్ణావతారం

వికద్రుడు చెప్పిన మాటలు కృష్ణుడు శ్రద్ధగా విని, "దీనికి ప్రస్తుతం ఒకటే ఉపాయం తోస్తున్నది. నేనూ, అన్నా కూడా వెంటనే బయలుదేరి, జరాసంధుడు మొదలైనవారు చూస్తూండగా దక్షిణ దిక్కుగా పోతాం. అప్పుడతను మధురా నగరాన్ని ముట్టడించే యత్నం మాని మా వెంట పడతాడు. మేము వింధ్యాద్రి మొదలైన పర్వతాలలో గల దుర్గాలను పట్టుకుని, జరాసంధుడితో యుద్ధం చేస్తాం. మే మిలా చెయ్యటం వల్ల మన కులం వారికీ, రాష్ట్ర పౌరులకూ ఆపద తప్పుతుంది," అన్నాడు.

దీనికి అందరూ సమ్మతించారు. అప్పటికప్పుడే బలరామకృష్ణులు నిరాయుధులై మధుర నుంచి బయలుదేరి, ధైర్యంగా జరాసంధుడి దగ్గిరికే వెళ్ళి, "మగధ రాజా, నానా దేశాల సైన్యాలను వెంటబెట్టుకుని ఇక్కడికి ఏ ఉద్దేశంతో వచ్చావో చెప్పు. మేము కూడా సహాయం చేస్తాం," అన్నారు.

జరాసంధుడు కృష్ణ బలరాముల రాక విని, కవచమూ, బాణమూ, రెండు అంబులపొదులూ ధరించి వచ్చి, "మీరిద్దరూ మహా బలవంతులని విని, మిమ్మల్ని యుద్ధంలో గెలుద్దామనే ఉద్దేశంతోనే వచ్చాను. మీ ప్రాణాలు తీయకుండా తిరిగి వెళ్ళేది లేదు. కనుక మీరు కూడా యుద్ధ సన్నద్ధులై రండి," అన్నాడు.

13. జరాసంధ పరాజయం



అత నా మాట అనగానే బలరామ కృష్ణులు కొంచెం కూడా తొణకకుండా, అక్కడి నుంచి బయలుదేరి తిన్నగా దక్షిణదిక్కుగా నడుచుకుంటూ వెళ్ళి పోయారు. వాళ్ళు అలా అనేక దేశాలూ, నగరాలూ దాటి, వింధ్యారణ్యాలను సమీపించి, సహ్యాద్రి మీది అరణ్యంలో ఒక మహావటవృక్షం కింద పరశురాముణ్ణి చూశారు.

అక్కడ పరశురాముడు శివార్చన చేస్తున్నాడు. ఒక పక్కగా హోమధేనువు, దూడతో సహా కట్టి ఉన్నది. ఆయనకు ఒక పక్కన స్రుక్స్రువాలూ, అరణీ, కమండలువూ, చక్కగా ప్రజ్వలిస్తున్న అగ్నీ ఉన్నాయి; మరొక పక్కన ఒక మహా ధనువూ, బాణాలూ, ఖడ్గమూ, గండ్రగొడ్డలీ ఉన్నాయి. ఈ విధంగా బ్రాహ్మణక్షాత్ర తేజాలతో వెలిగిపోతున్న పరశురాముణ్ణి సమీపించి, బలరామ కృష్ణులు ఆయన కాళ్ళకు తలలు తాకే లాగా ప్రణామం చేసి, ఆయనను స్తోత్రం చేశారు.

కృష్ణుడు ఆయనకు తమ కథను సంగ్రహంగా తెలుపుతూ, "మహాత్మా, మా నివాసం యమునా నదీ ప్రాంతానగల మధుర. యాదవ శ్రేష్ఠుడైన వసుదేవుడు మా తండ్రి. నా పేరు కృష్ణుడు, మా అన్న పేరు బలరాముడు. కంసుడి భయంచేత మా తండ్రి మమ్మల్ని పుట్టి నప్పుడే గోకులానికి పంపెయ్యగా, అక్కడ పెరిగి పెద్దవాళ్ళమయాము. తరవాత మధురా నగరానికి తిరిగివచ్చి, కంసుణ్ణి చంపి, అతని రాజ్యాన్ని అతని తండ్రికే ఇచ్చాం. కంసుణ్ణి చంపినందుకు మా మీద అలిగి జరాసంధుడు మా మీదికి పెద్ద సేనతో ఎత్తి వచ్చాడు. నిరాయుధులం కావటంచేత అతనితో యుద్ధం చేసే అవకాశం లేక, అతను చూస్తుండగానే కాలినడకన ఇటుగా వచ్చాం. మేమిప్పుడేం చెయ్యాలో సలహా ఇచ్చి మమ్మల్ని అనుగ్రహించండి," అని కోరాడు.



పరశురాముడు అంతా విని, "మీరిటు దక్షిణాపథానికి రావటం చూశాడు కనక, జరాసంధుడు తన సైన్యంతో సహా మిమ్మల్ని వెంబడించి వస్తాడు. జరాసంధుణ్ణి జయించటానికి అనుకూలంగా ఉండే దుర్గం ఒకటి ఉన్నది. నేను మీవెంట వచ్చి అక్కడ దిగవిడుస్తాను," అన్నాడు.

ముగ్గురూ కలిసి బయలుదేరారు. వారు కొన్ని రోజులు నడిచి గోమంత మనే పర్వతాన్ని చేరారు.

గోమంతం ఒక మహా పర్వతం. దానికి ఒకే ఒక శిఖరం ఉన్నది. ఆ పర్వతం మీదికి వెళ్ళి, ఆ శిఖరాన్ని చేరుకున్నట్టయితే, అక్కడినుంచి సూర్యచంద్రులు ఉదయించే చోటూ, అస్తమించే చోటూ దగ్గిరలో ఉన్నట్టే కనిపిస్తాయనీ, అనేక లంకలతోసహా సముద్రం కనిపిస్తుందనీ పరశురాముడు బలరామకృష్ణులకు చెప్పాడు.

"మీరీ కొండ మీద నుంచి యుద్ధం చేసినట్టయితే, జరాసంధుడూ, అతనికి సహాయంగా వెంట వచ్చిన వివిధ దేశాల రాజులూ ఓడి వెళ్ళిపోతారు," అన్నాడాయన.

ఆ తరవాత ముగ్గురూ అతి వేగంగా పర్వతం పైకి ఎక్కారు.

"మీ శత్రువులు చేరవస్తున్నట్టు ధ్వనులు వినిపిస్తున్నాయి. మీరు మహా జాగ్రత్తగా ఉండండి. ఇక నేను వెళ్ళి వస్తాను," అని పరశురాముడు అనేసరికి, బలరామకృష్ణు లాయనను గౌరవంగా సాగనంపారు.

తరవాత బలరామకృష్ణులు ఆ పర్వతం మీది గుహలూ, ప్రకృతిదృశ్యాలూ చూస్తూ గడిపారు.

అంతలో జరాసంధుడి సేన ఆర్భాటంగా వచ్చి, పర్వతం చుట్టూ విడిసింది. ఆ సేనలో జరాసంధుడి వెంట శిశుపాలుడూ, రుక్మి, చేకితానుడూ, బాహ్లికుడూ, ద్రుపదుడూ, విరాటుడూ, ఉత్త



మౌజుడూ, జయద్రథుడూ మొదలైన రాజులున్నారు.

జరాసంధుడు వీరందరినీ పిలిపించి సభ చేసి, ''యాదవ కుమారులు ఈ కొండ మీద ఉన్నట్టు తెలిసింది. పర్వతాన్ని సులువుగా ఎక్కడానికి వీలుగా రాళ్ళూ, తిప్పలూ ధ్వంసం చేయింతాం. అక్కడక్కడా ఒడిసెల వాళ్లను ఏర్పాటు చేతాం. పైనుంచి ఎవరు తొంగి చూసినా సరే వెంటనే బాణాలూ, ఈటెలూ విసురుదాం. అవసరమైతే ఈ పర్వతాన్ని పిండి కొట్టి అయినా మనం వచ్చిన పని జయప్రదంగా పూర్తి చేసి మరీ తిరిగిపోదాం.'' అన్నాడు.

దానికి శిశుపాలుడు, ''ఈ పర్వతం దేవతలకే సాధ్యం కాదంటారు. రథాల మీద విశ్రాంతి తీసుకునే మన రాజులు నడిచి దీన్ని ఎక్కగలరా? చాలామందిమి ఉన్నాం గదా అని విరుచుకుపడటం నీతి కాదు, ఉపాయమూ కాదు. బలరామ కృష్ణులను పిల్లల కింద జమకట్టవద్దు. దుర్గం వాళ్ళ అధీనంలో ఉన్నది కాబట్టి, యుద్ధం చేసేకన్న ముట్టడివేసి, వాళ్ళకు అన్నపానాలు లేకుండా చెయ్యటం తెలివైన పని. మరొక ఉపాయం కూడా ఉన్నది. కొండ చుట్టూ నిప్పు పెట్టామంటే వాళ్ళు దానికి ప్రతిక్రియ చెయ్యలేక చిక్కులో పడతారు.'' అన్నాడు.

చేది రాజైన శిశుపాలుడు చెప్పిన ఈ ఉపాయం జరాసంధుడికి నచ్చింది.

సైనికులు పర్వతం చుట్టూ ఎండిన మానులూ, కంపా పేర్చి, గాలి వాలున అవి మండేటట్టుగా నిప్పు పెట్టి, ఆ మంటల మీదికి కట్టెలూ, గడ్డీ ఎగదోశారు. వెంటనే పర్వతం చుట్టూ కార్చిచ్చు బయలుదేరింది. మంటలూ, నిప్పురవ్వలూ, పొగా ఆకాశంలోకి లేచాయి.

ఇదంతా చూస్తున్న బలరాముడు కృష్ణుడితో, ''చూశావా, మన మూలాన ఈ పర్వతానికెంత దుర్దశ కలిగిందో! మనం చూస్తూ ఊరుకోవటం కన్న వేరే

అపకీర్తి ఏముంటుంది? నే నిప్పుడే ఈ జరాసంధుణ్ణి నా భుజబలంతో చంపేస్తాను. ఇన్ని దేశాలనుంచి, ఇంతమంది రాజులు ఇంత సైన్యాన్ని వెంటబెట్టుకుని యుద్ధానికి వస్తారా? భూమిమీద రాజనేవాడు లేకుండా చేస్తాను,'' అని కొండ మీదినుంచి, కింద ఉన్న సేన మధ్యకు ఎగిరి దూకాడు. ఆ క్షణమే కృష్ణుడు కూడా అలాగే దూకాడు. రెండు మందర పర్వతాలు ఒక్కసారిగా పడితే సముద్రం అల్లకల్లోలమైనట్టుగా, జరాసంధుడి సేన వాళ్ళపాటుకు చెల్లాచెదరయింది. వాళ్ళ పాదఘట్టనతో పర్వతం కొంచెం కుంగి, పాతాళ గంగ పైకి వచ్చి, మంటలు ఆరిపోయాయి.

ఆ అన్నదమ్ముల శౌర్య సాహసాలను మెచ్చి, దేవతలు ఆకాశంనుంచి వారిద్దరికీ రకరకాల ఆయుధాలు అందించారు. ఆ క్షణంలో కృష్ణుడు విష్ణుమూర్తిలాగానూ, బలరాముడు సహస్రఫణాలు గల ఆదిశేషుడులాగానూ కనిపించారు. వాళ్ళిద్దరూ విజృంభించి సైన్యాన్ని ఎడా పెడా వధ చేస్తూంటే రాజులు పారిపోసాగారు.

వాళ్ళను వెనక్కు పిలుస్తూ జరాసంధుడు, ''యుద్ధంలో వెన్నిచ్చి పారిపోయే వారికి భ్రూణహత్యాపాతకం లాటిది చుట్టుకుంటుందని పెద్దలు



చెప్పారు. మీరంతా మహామహా యోధులై ఉండి, ఇద్దరు పిల్లవాళ్ళకు దడిచి పారిపోతున్నారా? మీరు కాలుతొక్కుకు నిలబడి నన్ను చూడండి. నేనుండగా మీకే అపాయమూ రానివ్వను. ఈ యాదవులను నా బాణాలకు ఎరచేసేస్తాను,'' అన్నాడు.

ఈ మాటలు విని పారిపోయే రాజులు వెనక్కు తిరిగి, తమ సేనలను వెనక్కు తిప్పి, బలరామకృష్ణులనుచుట్టుముట్టారు. అంతమంది తమపైన వివిధాస్త్రాలనూ, శస్త్రాలనూ ప్రయోగిస్తున్నా చలించక, బలరామకృష్ణులు తమ చుట్టూ ఉన్న సేనను ఊచకోత కోస్తూ, పీనుగు పెంట



కుప్పలు వేశారు. రాజులు క్రమంగా వెనక్కు తగ్గసాగారు. అప్పుడు కృష్ణుడు వారితో, "అందరూ వాహనాలెక్కి ఉన్నారు; అందరూ అనేక యుద్ధాలలో ఆరితేరినవారే; నేలమీద నిలబడి యుద్ధం చేసే మమ్మల్ని ఎదుర్కోలేక వెనక్కు తగ్గటం ఏమీ బాగాలేదు. మిమ్మల్ని అడ్డం పెట్టుకుని ఆ జరాసంధుడు దూరదూరంగా ఉంటున్నాడు. అతని కోసం మీరెందుకు చావాలి? అతన్ని పట్టుకురండి, నా యుద్ధ పటిమ చూపిస్తాను," అన్నాడు.

ఈ మాట విని జరాసంధుడు, పౌరుషం వచ్చి, ఒకరథంమీదఒంటరిగా కృష్ణుడున్న చోటికి వచ్చాడు, అతను కృష్ణుణ్ణి చూసి, "నేనుండగా మధ్య ఈ రాజుల నెందుకవమానిస్తావు? యుద్ధమంటే అడవిలో పశువులను కాయుటం కాదు. నువేదో మహా బల పరాక్రమాలు కలవాడివిట. అదంతా నామీద చూపించినప్పుడుగదా సార్థకమయేది? నువు నిలిచి పోట్లాడు. క్షణంలో నిన్ను యమధర్మరాజు దగ్గిరికి పంపేస్తాను," అన్నాడు.

"నా ప్రతాపం తెలుసుకో గోరితే నేను ఎదటే ఉన్నాను గద. శూరుడు ప్రగల్భాలాడరాదు. నీ శస్త్రాస్త్రపటిమ చూపించు," అంటూ కృష్ణుడు జరాసంధుడి పైన ఎనిమిది బాణాలూ, అతని సారథిపైన అయిదు బాణాలూ వేశాడు. ఆ క్షణంలోనే బలరాముడు జరాసంధుడి చేతిలోని వింటిని తన బాణాలతో విరగగొట్టాడు. జరాసంధుడికి కాపుగా అతని సేనాపతులు, కౌశిక చిత్రసేనులనే వాళ్ళు, బలరామకృష్ణుల మీదికి వచ్చారు. యుద్ధం అతి దారుణంగా సాగింది. యుద్ధంలో దెబ్బ తిని కృష్ణుడూ, బలరాముడూ, జరాసంధుడూ కూడా ఒకరి తరవాత ఒకరు మూర్ఛపోయారు. జరాసంధుడి పక్షాన కొందరు చచ్చారు. చివరకు జరాసంధుడు నిలవలేకపోయాడు. అతనూ, అతని సేనా ఓడి పారిపోయారు. కృష్ణుడు విజయగర్వంతో పాంచజన్యం ఊదాడు.

బలరామకృష్ణులు కొంత కాలంపాటు గోమంతగిరి మీదనే విశ్రాంతి తీసుకుందా మని నిశ్చయించారు. అంతలో ఒక చిత్ర మైన సంఘటన జరిగింది.

జరాసంధుడి వెంట రాజులందరూ వెళ్ళిపోయారు. అయితే చేదిదేశపు రాజైన దమఘోషుడనేవాడు, శిశుపాలుడి తండ్రి, తన సేనలతో సహా గోమంతానికి తిరిగివచ్చి, కృష్ణుణ్ణి కలుసుకుని, ''నాయనా, నేను మీ మేనత్త పెనిమిటిని. నా పేరు దమఘోషుడు. ఈ జరాసంధుడు మహా ధూర్తుడు. కృష్ణుడితో వైరం వద్దని చాలాసార్లు చెప్పి చూశాను, కాని విన్నాడు కాడు. వాడంటే భయంగాని, లేకపోతే ఎన్నడో విడిచిపెట్టి ఉందును. ఇవాళ వాడి ఓటమి చూసి, నాకు అయిన వారందరితో సహా నీ పక్షం వచ్చేశాను. కాని వీడు బలవంతుడు. ఇంతటితో వీడి పీడ విరగడ అయిందనుకోకు, మళ్ళీ ఏదో వంక వెతుకుతాడు. ఈ పీనుగు పెంటల మధ్య ఇంకా నువు దేనికి ఉన్నట్టు? పోదాంపద. ఇక్కడికి దగ్గిర లోనే కరవీరపురం అని ఉన్నది. దాన్ని పాలించే సృగాలవాసుదేవుడికి నీపైన చాలా ఈర్ష్య. వాణ్ణి అణచటం అవసరం. ఇవిగో, రెండు ఉత్తమ రథాలు. వీటిని మీ అన్నదమ్ము లిద్దరూ తీసుకోండి,'' అన్నాడు.

కృష్ణుడు దమఘోషుణ్ణి అభిమానంతో చూసి, ''బంధుత్వంతో గూడిన ప్రేమ అంటే ఇలాగే ఉండాలి. నీ మాటలు మాకు మహదానందం కలిగించాయి. నీవంటి వాడి ప్రాపు దొరకటంచేత మేము ధన్యులం. ఇప్పుడు జరిగిన యుద్ధం చూశావుగద! ఇదే పద్ధతిలో మేము ఎన్ని యుద్ధాలైనా అవలీలగా చెయ్యగలం,'' అన్నాడు.

ఆ రోజే బలరామకృష్ణులు రథాలెక్కి దమఘోషుడి బలాల వెంట బయలుదేరి, దారిలో రెండు మజిలీలు వేసి, మూడో నాడు ఉదయం కరవీరపురం చేరి అక్కడ శిబిరం వేశారు.






విక్రమపురిరాజ్యాన్ని పాలించే వినోదవర్మకు సాహిత్య, శాస్త్ర చర్చలంటే చాలా యిష్టం. ఆయన ఎక్కువకాలాన్ని పండితగోష్ఠులలో గడుపుతూండేవాడు. ఇది అదనుగా తీసుకుని రాజుకు స్వయానా మేనల్లుడూ, సైన్యాధిపతీ అయిన నాగవర్మ పరిపాలనలో అనవసర జోక్యం కలిగించుకుంటూ, నిరంకుశమైన పద్ధతులతో ప్రజలను నానా యాతనలూ పెట్టసాగాడు.

ఇలా కొంతకాలం జరిగాక, నాగవర్మకు రాజును పదవినుంచి తొలగించి, తానే సింహాసనం ఎందుకు ఆక్రమించుకోకూడదు అన్న దురాలోచన కలిగింది. అందుకోసం అతడు పథకాలు వెయ్యడం ప్రారంభించాడు.

మంత్రి మాణిక్యవర్మ, నాగవర్మ చేస్తున్నదంతా గమనిస్తూనే వున్నాడు. ఒక రోజున ఆయన రాజును కలుసుకుని, నాగవర్మ చేస్తున్న అగడాలూ, చేయబోతున్న కుతంత్రం, అంతా పూసగుచ్చినట్టు చెప్పి, "మహారాజా, తమరు వెంటనే తగిన చర్యలు తీసుకోకపోతే పెద్ద ముప్పు వాటిల్లగలదు!" అని హెచ్చరించాడు.

వినోదవర్మకు సహజంగా బంధువులంటే ఎంతో అభిమానమూ, నమ్మకమూ. ఆ కారణంచేత ఆయన, నాగవర్మను పిలిచి సంగతి తెలుసుకున్న తర్వాతే, ఏమి చేయాలన్నది ఆలోచిద్దామనుకున్నాడు.

ఆయన మర్నాడు నాగవర్మను పిలిపించి, మంత్రి చెప్పినదేమిటో అతడికి వివరించి, "ఇదంతా నిజమేనా?" అని గద్దించి అడిగాడు.

నాగవర్మ చేతులు జోడించి, "నేను మీకు హాని తలపెట్టడమా! కాని ఒక విషయం మాత్రం నిజం. తమకు ఎలాంటి

జొన్నలగడ్డ రత్న

అసౌకర్యమూ, శ్రమా లేకుండా పరిపాలన సక్రమంగా సాగిపోవాలన్నది, నా అభిప్రాయం. అందువల్ల, వీలయినప్పుడల్లా ప్రజల మధ్యకు వెళ్ళి, వాళ్ళ అవసరాలు తెలుసుకుని, తగిన విధంగా పరిష్కరించి వస్తున్నాను. వాళ్ళేం చేయాలనుకున్నా, మాట్లాడుకోవాలనుకున్నా కావలసినంత స్వేచ్ఛ వున్నది. ఆ కారణంగా, ప్రజలు మునుపటికన్న తమరిని ఎక్కువగా అభిమానిస్తున్నారు,'' అన్నాడు.

''నువ్వు చెప్పినదానికీ, మంత్రి చెప్పినదానికీ ఎక్కడా పొంతనలేదు,'' అన్నాడు వినోదవర్మ.

''బహుశా మంత్రిగారికి, నే చేస్తున్న మంచిపనులు చూసి ద్వేషభావం కలిగి వుంటుంది. పరిపాలన గురించి ప్రజలు ఏమనుకుంటున్నారో తెలుసుకునేందుకు, వాళ్ళను సభకు పిలిపించి, తమరే ప్రశ్నించవచ్చుగదా!'' అన్నాడు నాగవర్మ.

ఆ సలహాకు రాజు వినోదవర్మ కొంత ఆశ్చర్యపడి, ''సరే, రేపే ప్రజలను సభకు రావలసిందిగా చాటింపు వేయించు,'' అన్నాడు.

రాజు వినోదవర్మ ప్రజల కష్టసుఖాలు స్వయంగా తెలుసుకునేందుకు సభ ఏర్పాటు చేస్తున్నట్టు, దేశం నలుమూలలా నాగవర్మ చాటింపు వేయించాడు. అయితే దానితోపాటు నాగవర్మ అనుచరులు పట్టణాలూ, పల్లెలూ తిరిగి, రేపు రాజసభలో ఎవరైనా నాగవర్మకు వ్యతిరేకంగా



మాట్లాడితే, వాళ్ళకు పుట్టగతులులేకుండా చేయగలమని బెదిరించారు.

ఇది విన్న ప్రజలు చాలామంది లేనిపోని బాధలకు గురికావడం ఎందుకని, సభకు రావడం మానేశారు. ఇక మర్నాడు రాజసభకు వచ్చినవాళ్ళంతా నాగవర్మ అభిమానులే. వాళ్ళంతా రాజ్యంలో ఎలాంటి అభివృద్ధి పనులు జరుగుతున్నవో చెప్పి, అందుకు నాగవర్మ సహాయమే ముఖ్య కారణం అని, అతణ్ణి పొగడసాగారు. మంత్రి మాణిక్యవర్మ జరుగుతున్న కుతంత్రమంతా చూస్తూ, నిస్సహాయుడుగా వుండిపోయాడు.

రాజు వినోదవర్మ పట్టరాని సంతోషంతో, ''అయితే, నామీదగాని, నా పరిపాలన మీదగాని మీలో ఎవరికీ చెడ్డ అభిప్రాయం లేదని అనుకోవచ్చా?'' అని వాళ్ళను ప్రశ్నించాడు.

అందుకు నాగవర్మ మనుషులు ఉత్సాహంగా కరతాళధ్వనులు చేస్తూండగా, వాళ్ళ మధ్యనుంచి గోవిందుడనే యువకుడు ముందుకువచ్చి, వినయంగా, ''మహారాజా, తమ పరిపాలనను విమర్శించేటంత గొప్పవాణ్ణి కాకపోయినా, అవకాశంయిచ్చారు గనక తమరిని మూడు ప్రశ్నలు అడగాలనుకుంటున్నాను,'' అన్నాడు.

రాజు, అమితాశ్చర్యంతో ఆ యువకుడికేసి చూస్తూ, ''ఏమిటా ప్రశ్నలు?'' అని అడిగాడు.





''మహారాజా, దేశంలో ప్రజలు ముప్పూటలా సుష్టుగా భోజనాలు చేస్తున్నారని ప్రచారం జరుగుతున్నది. అయితే, సగానికి సగంమంది ప్రజలు ముష్టి ఎత్తుకుని ఎందుకు బతుకుతున్నట్టు? ముష్టివాళ్ళను ప్రజలుగా లెక్కించరా?'' అని అడిగాడు గోవిందుడు.

రాజు, నాగవర్మకేసి కోపంగా చూశాడు. నాగవర్మ ఏదో చెప్పబోయేసరికి రాజు అతణ్ణి వారించి, గోవిందుడితో, ''నీ రెండో ప్రశ్న ఏమిటి?'' అన్నాడు.

''దేశంలో ప్రజలందరూ, ఎవరిపనులు వారు నిర్భయంగా చేసుకుపోతున్నారనీ, వారు మాట్లాడడానికి కావలసినంత స్వేచ్ఛ వున్నదనీ చెప్పబడుతున్నది. తమరు నిజం పరిశీలిస్తే, వేలకొద్దీ జనం చెరసాలల్లో మగ్గుతున్నారు. వాళ్ళందర్నీ ఏం నేరాలు చేశారని చెరసాలల్లో పెట్టినట్టు?'' అని అడిగాడు గోవిందుడు.

అప్పుడు రాజు గంభీరంగా, ''అలాగా! అయితే నీ మూడో ప్రశ్న ఏమిటి?'' అని అడిగాడు.

గోవిందుడు, రాజుకు చేతులు జోడించి. ''మహారాజా, నాదొక చిన్న మనవి. ఈ మూడో ప్రశ్న కొద్ది రోజుల తర్వాత, నా తండ్రి వచ్చి అడగవచ్చు. అందుకు అనుమతించండి,'' అని కోరాడు.

గోవిందుడు అలా కోరగానే రాజు, అతణ్ణి దగ్గిరకు రమ్మనిపిలిచి, అప్యాయంగా అతడి భుజం తడుతూ, ''దేశానికి కావలసింది, నీవంటిధైర్యవంతులైన యువకులు. నీ మొదటి రెండు ప్రశ్నలూ నాకు అర్థమయ్యాయి. వాటికి సముచితంగా సమాధానం చెప్పే బాధ్యత, నామీద వున్నది. నీ తండ్రి, నన్ను అడగగలడన్న ఆ మూడో ప్రశ్న ఏమిటో, అతడు అడగనక్కరలేకుండానే, నేను గ్రహించాను. అతడా ప్రశ్న అడగడానికి కూడా నేనెలాంటి అవకాశం కల్పించ దలుచుకోలేదు!'' అంటూ భటుల్ని పిలిచి నాగవర్మనూ, అతణ్ణి సమర్థించే ప్రతి ఒక్కణ్ణీ అక్కడి

కక్కడే బంధించమని ఆజ్ఞాపించాడు. ఇది చూసి మంత్రి మాణిక్యవర్మ విస్తుపోయాడు.

రాజాజ్ఞప్రకారం నాగవర్మా, అతడి అనుచరులూ చెరసాలలో పెట్టించబడ్డారు. తర్వాత రాజు వినోదవర్మ స్వయంగా పరిపాలనా బాధ్యతలు స్వీకరించి రాజ్యంలో సుఖశాంతులు పునరుద్ధరించాడు.

ఇది జరిగిన కొన్నాళ్ళకు ఒకనాడు మంత్రి మాణిక్యవర్మ, రాజుతో, "ప్రభూ, నాగవర్మా, అతడి అనుచరులూ రాజ్యంలో అంతా సవ్యంగానే వున్నదని మిమ్ములను నమ్మించడంలో కృతకృత్యులవుతున్న సమయంలో—ఒక్క గోవిందుడనే యువకుడు మిమ్ములను అడిగిన, ఆ రెండు ప్రశ్నలతో వాస్తవం ఏమిటో ఎలా అర్థం చేసుకోగలిగారు? గోవిందుడు తన తండ్రి అడుగుతాడన్న, ఆ మూడో ప్రశ్న ఏమిటి? అది అతడు తన తండ్రి ద్వారానే ఎందుకు అడిగిస్తానన్నాడు? మీరు గోవిందుడితో అటువంటి ప్రశ్న ఇక ముందు అడగనవసరం వుండదని అనడంలోని అంతరార్థమేమిటి?" అన్నాడు.

మంత్రి అడిగినదానికి, రాజు వినోదవర్మ మందహాసం చేసి, "రాజ్యంలో నాగవర్మ కల్పిస్తున్న భయంకరపరిస్థితుల దృష్ట్యా, గోవిందుడు ఆ రెండు ప్రశ్నలూ నన్నడిగిన తర్వాత—ఇక తాను బతికి బట్టకట్టడమంటే అసాధ్యమని నాకు సూచనప్రాయంగా తెలియపరిచాడు. ఇక తర్వాత తన జాడతెలియక తండ్రి, నా దగ్గిరకు వచ్చి, "నా గోవిందుడెక్కడ?" అని నన్నడగబోయేదే, ఆ మూడో ప్రశ్న. దానితో నేను దేశంలో ఎంత అరాజకం ప్రబలి వున్నదో గ్రహించి, అతడితో, అతని తండ్రి ఆ మూడో ప్రశ్న అడగవలసిన అవసరం వుండదన్నాను." అని జవాబిచ్చాడు.

గోవిందుడి మూడో ప్రశ్న రాజ్యానికి అంతటి ఉపకారం చేసినందుకు, మంత్రి మాణిక్యవర్మ ఎంతగానో సంతోషించాడు.






# తల్లి సలహా

సుధాము డనే వాడికి, ఇటీవలే పెళ్ళయింది. అనారోగ్యంవల్ల, పెళ్ళికి వాడి మేనమామ రాలేకపోయాడు. వాడి మేనమామది పొరుగుగ్రామం. ఆయన్ని చూసి పరామర్శించివద్దామని, సుధాముడు మేనమామ ఇంటికి వెళ్ళాడు.

మేనమామ అందరిక్షేమ సమాచారాలడిగి, "దేవుడి దయవల్ల, తిరిగి కోలుకున్నారా, సుధామా! నీ కొత్త కాపరం ఎలా వున్నది? నీ భార్య ఇంటిపనుల్లో, వంటపనుల్లో, మీ అమ్మకు సాయపడుతున్నదా?" అని అడిగాడు.

"సాయపడడం ఏమిటి, మామయ్యా! ఆవిడే అన్ని పనులూ చేసుకుపోతున్నది." అని జవాబిచ్చాడు సుధాముడు.

"అయితే, మీ అమ్మకు ఈ ముసలితనంలో కావలసినంత విశ్రాంతి. మీ నాన్న పోయాక, నిన్ను పెంచి పెద్దచేసేందుకు ఎన్ని యిక్కట్లు పడిందనుకున్నావు! ఇక సంతోషంగా రోజులు గడిపేయగలదు." అన్నాడు మేనమామ.

సుధాముడు ఏదో చెప్పబోయినవాడల్లా, సంకోచిస్తూ వూరుకున్నాడు.

అది గ్రహించినవాడి మేనమామ, "ఏదో చెప్పబోయి వూరుకున్నావు. ఏమిటి విశేషం. నా దగ్గిర దాపరికమెందుకు? అదేమిటో చెప్పు." అన్నాడు.

"కోడలు కాపరానికి వచ్చినప్పటి నుంచీ, అమ్మ అదోలా వుంటున్నది. వల్లమాలిన పరధ్యానం. అప్పుడప్పుడూ బాగా విచారంగా వున్నట్టు కనబడుతున్నది." అన్నాడు సుధాముడు.

"కారణంఏమిటో అడక్కపోయావా?" అన్నాడు మేనమామ.

"నేను అడుగుదామనుకుంటూండగా, అమ్మే చెప్పింది, కోడలు చెరువుకు నీళ్ళ

బి. రఘురామరాజు



కోసం వెళ్ళినప్పుడు.'' అన్నాడు సుధా ముడు.

మేనమామ నాలుగైదు క్షణాలు ఆలోచిస్తూ వూరుకుని, ''సరే, ఆ చెప్పిన దేమిటో నీకు బాగా గుర్తుందా? ఉంటే— ఒక్క అక్షరం, ఒక్క మాట పొల్లు పోకుండా చెప్పు,'' అన్నాడు.

''ఇది జరిగి వారం కూడా కాలేదు, మామయ్యా. అంతా నాకు చాలా బాగా గుర్తు,'' అన్నాడు సుధాముడు.

''సరే, కానీమరి!'' అన్నాడు మేనమామ.

''ఆ రోజు ఉదయం పదిగంటల వేళప్పుడు, పెరట్లో వున్న నన్ను, అమ్మ కేకవేసి పిలిచి, నీ పెళ్ళాం పెరట్లో వుందా? చెరువుకు నీళ్ళకు వెళ్ళిందా? అని అడిగింది. ఇప్పుడేగదా బిందె తీసుకు వెళ్ళింది. నువ్వు చూడలేదా?" అన్నాను.

''అయితే యిటొచ్చి కూర్చో!'' అని అరుగు మీద తన పక్కన కూర్చోబెట్టుకుని, 'దాని అందాన్ని, దాని ఎదట పొగడకురా, నాయనా,' అన్నది.

''ఎందుకని?'' అని అడిగాను.

''దానికళ్ళు నెత్తికెక్కుతాయి. నిన్ను చులకనగా చూస్తుంది!'' అన్నది అమ్మ.

నేను మౌనంగా వుండిపోయాను. ''ఎంతయినా పెళ్ళాం కదా అని, అన్ని సంగతులూ దాని చెవిలో ఊదకు సుమా!" అన్నది అమ్మ.

''ఏమవుతుంది?'' అని అడిగాను.

''అయినవాళ్ళకూ, కానివాళ్ళకూ చెప్పి, ఇంటి గుట్టు రట్టు చేస్తుంది,'' అన్నది అమ్మ.

నేను తలాడించి వూరుకున్నాను. ''ఎంత మంచిగా చెప్పినాసరే, దాని సలహాలు పాటించకు!'' అన్నది అమ్మ.

''పాటిస్తే ఏం జరుగుతుంది?'' అని అడిగాను.

''ఏం జరగడం ఏమిటి? నన్ను బయటికి గెంటమని సలహా యిచ్చినా యివ్వగలదు,'' అన్నది అమ్మ.

నేను చూస్తూ వూరుకున్నాను. "ఏనాడూ పెట్టెతాళాలు దాని చేతికివ్వకు, తండ్రీ!" అన్నది అమ్మ బతిమాలుతున్న ధోరణిలో.

"ఇస్తే, ఏం జరుగుతుందని, నీ భయం?" అని అడిగాను.

"ఒక్కొక్క రూపాయి మెల్లగా తన పుట్టింటికి చేరవేస్తుందిరా, పిచ్చిమొద్దూ!" అన్నది అమ్మ కోపంగా.

"నేనిక ఉండబట్టలేక—అమ్మా, యివన్నీ నీకెలా తెలుసు?" అని అడిగాను.

"అడగవలసిన ప్రశ్నే అడిగావురా! అందుకు అమ్మ ఏమన్నది?" అని చిరునవ్వునవ్వుతూ ప్రశ్నించాడు మేనమామ.

"తల్లిని అలాంటి ప్రశ్నలడగవచ్చురా? ఛీ, వెధవా నోరుమూసుకో— అంటూ అమ్మలేచి వంటగదిలోకి వెళ్లిపోయింది." అన్నాడు సుధాముడు.

మేనమామ ఒకసారి పెద్దగా నవ్వి, అంతలోనే ముఖం గంభీరంగా పెట్టి మౌనంగా వుండిపోయాడు.

సుధాముడు మేనమామకేసి కొంచెంసేపు చూస్తూ వూరుకుని, "ఏం, మామయ్యా, మాట్లాడవేం?" అని అడిగాడు.

"ఏం మాట్లాడమంటావు?" అన్నాడు మేనమామ.

"నేనింతకుముందు అడిగాగదా! అమ్మకు యివన్నీ ఎలా తెలుసు? ఆమె కోపగించుకున్నదనుకో. నీకేమైనా తెలిస్తే చెప్పు." అన్నాడు సుధాముడు పట్టుదలగా.

"నాకు తెలుసు! ఆ సంగతి నువ్వు తెలుసుకున్నందువల్ల కలిగే ప్రయోజనం ఏమిటి?" అని అడిగాడు మేనమామ.

"ఆ విధంగా నాకు అమ్మ విచారానికి కారణం ఏమిటో తెలుస్తుంది. అప్పుడు నేను అమ్మకు నచ్చచెప్పి, ఆమెకున్న అనుమానాలూ, భయాలూ పోయేలా చేస్తాను," అన్నాడు సుధాముడు.

"అయితే విను! మా అక్కయ్య— అదే మీఅమ్మ కాపురానికి వెళ్ళిన కొత్తలో చేసిన ఘనకార్యాలే యివన్నీ!" అన్నాడు పొట్టచెక్కలయేలా నవ్వుతూ, మేనమామ.





# ఫలించని వరం

ఒక గ్రామంలో ఇద్దరు స్త్రీలుండేవారు. వారిలో ఒకతె చాలా డబ్బుగలది, కాని పిసినిగొట్టు, చాలా కఠినహృదయురాలు కూడా.

రెండోఆవిడ చాలా పేదది, కాని చాలా మంచిది; ఆవిడ హృదయం వెన్నలాటిది.

ఈ ఇద్దరు స్త్రీలూ పక్కపక్క ఇళ్ళలోనే ఉండేవారు.

ఒకనాటి సాయంకాలం ఒక బిచ్చగాడు అటుగా వెళుతూ ధనికురాలి ఇంటి తలుపు తట్టాడు. ఆవిడ తలుపు తీసి, బిచ్చగాణ్ణి చూసి దబాల్న మళ్ళీ తలుపు మూసింది. "ఇంకో చోటు చూసుకో, నాయనా!" అని అయినా ఆవిడ నోట రాలేదు.

బిచ్చగాడు మరి రెండడుగులు వేసి పేదరాలి తలుపు తట్టాడు. ఆవిడ తలుపు తీసి బిచ్చగాణ్ణి చూసింది. తనకే కడుపు నిండా తిండి లేకపోయినప్పటికీ, ఆవిడ లోపలికి వెళ్ళి ఇంత రొట్టె తెచ్చి బిచ్చగాడికిచ్చి, "ఇది తిని కాస్త మజ్జిగ తాగు. పొద్దూకుతున్నది. కావలిస్తే ఈ రాత్రికి మా పంచలో పడుకోవచ్చు," అన్నది ఎంతో ఆదరంగా.

బిచ్చగాడు రొట్టె తిని, మజ్జిగ తాగి, "నేను వెళ్ళాలి, తల్లీ. నీకే లోటూ లేకుండా జరిగిపోతున్నదా, అమ్మా?" అని అడిగాడు.

"నాకు ఎక్కువగా కావలిసిందేమిటి, నాయనా? బాగానే జరుగుతున్నది," అన్నది పేదరాలు.

"పెట్టేవారికి పుట్టకపోదులే, అమ్మా. పొద్దున ప్రారంభించిన పని పొద్దూకేదాకా ముగించవు. చూస్తూ ఉండు!" అంటూ బిచ్చగాడు బయలుదేరి తన దారిన వెళ్ళిపోయాడు.




వాడు అలా ఎందుకన్నాడో ఆవిడకు అర్థం కాలేదు. ఆవిడ వాడి మాటలను అప్పుడే మరిచిపోయింది కూడా.

మర్నాడు ఆమె పక్కమీది నుంచి లేస్తూనే తనవద్ద ఎంత బట్ట మిగిలి ఉన్నదీ కొలిచి చూద్దామనుకున్నది. ఆ బట్ట ఆవిడ పడికిన నూలుతో నేయించి ఉంచినదే. దాన్ని అమ్ముకుని ఆవిడ అవసరానికి ఖర్చు చేసుకుంటూ ఉండేది.

ఆవిడ తన పెట్టెలో నుంచి బట్టచుట్ట తీసి మూరవేసి, ''ఒకటీ, రెండూ,'' అని కొలవ నారంభించింది. ఎన్ని మూరలు కొలిచినా ఇంకా బట్ట వస్తూనే ఉంది. ''పొద్దున ప్రారంభించిన పని పొద్దూకే దాకా ముగించవు. చూస్తూ ఉండు!'' అని బిచ్చగాడన్న మాటకు అర్థమేమిటో ఆవిడకు అప్పుడు తెలిసి వచ్చింది. ఆ రోజు సూర్యాస్తమయం అయే లోపల ఆవిడ అనేకవేల గజాల బట్టను మూర వేసింది. ఆ విధంగా ఆవిడ కొలిచిన బట్ట ఇంటినిండా ఇంతయెత్తున పోగు పడింది.

పల్లెటూళ్ళో ఏ విషయమూ దాగదు. మర్నాడు పొద్దుటికల్లా ఊళ్ళోవాళ్ళు ఈగల మందలాగా వచ్చి పేదరాలి ఇంటి మీద పడి తలా రెండు గజాలూ, నాలుగు గజాలూ బట్ట కొనుక్కుపోయారు.

ఈ విధంగా ఊళ్ళో అందరికీ అమ్మినా కూడా పేదరాలికి జీవితాంతం దాకా సరి పడే బట్ట మరికొంత మిగిలింది.

పేదరాలిని బిచ్చగాడు ఆశీర్వదించిన సంగతి కూడా ఊరంతా పాకింది. ఈ వార్త వినగానే పొరుగింటావిడ అసూయతో కుళ్ళిపోయింది. అటువంటి అవకాశం చేజేతులా పోగొట్టుకున్నందుకు ఆవిడకు మతిపోయినంత పని అయింది.

మూడు రోజులు గడిచినాక ఒక సాయంకాలం మళ్ళీ ఎవరో ధనికురాలి వాకిలి తట్టినట్టు చప్పుడయింది.

ధనికురాలు హడావిడిగా వెళ్ళి తలుపు తెరిచేసరికల్లా ఎదురుగా దేవుడల్లే ఆ బిచ్చగాడే కనిపించాడు.

''వచ్చావా, నాయనా? రా, లోపలికి రా! ఆ రోజు నీకు ఆతిథ్యం ఇవ్వలేక పోయాను. ఒకటా, రెండా? అన్ని పనులూ నేనే చేసుకోవాలాయె! ఆ రోజు ఎంత చిరాకులో ఉన్నానో చెప్పలేను. గొడ్డు కాస్తా పలుపు తెంచుకుని పాదులన్నీ పొట్టన పెట్టుకున్నది. అందుచేత నీ విషయమే చూడలేకపోయాను!'' అంటూ ధనికురాలు బిచ్చగాడి మీద ఎంతో అపేక్షగా మాట్లాడసాగింది.



అదంతా అపేక్షా? కానేకాదు! పేదరాలికి ఇచ్చిన వరమే బిచ్చగాడు తనకూ ఇవ్వాలని ఆవిడ ఆశ!

ఆవిడ బిచ్చగాణ్ణి లోపలికి పిలిచి కూరలతోసహా విందుభోజనం పెట్టింది. పాయసం కూడా వడ్డించింది. వాడు భోజనం ముగించాక, ''ఈ రాత్రికి ఎక్కడికి పోతావులే, నాయనా, యిక్కడే పడుకో. నవారు మంచమూ, మంచి బూరుగుదూది పరుపూ వేస్తాను. కప్పుకోవాలంటే మంచి శాలువా కూడా యిస్తాను!" అన్నది.

అయితే బిచ్చగాడు వెళ్ళాలన్నాడు. వెళ్ళేటప్పుడు వాడు, ''పొద్దున ప్రారంభించిన పని పొద్దూకేదాకా ముగించవులే, తల్లీ!'' అని ఆశీర్వదించి తన దారిన తాను బయటికి వెళ్ళిపోయాడు.

ధనికురాలి ఆనందానికి మేరలేదు. ఆ రాత్రి ఆవిడ కంటికి కునుకు లేదు. తెల్లవారుతూనే లేచి ఏం చేస్తే ఎక్కువ లాభిస్తుందో ఆమె తేల్చుకోలేకపోయింది. వెన్న చిలికితే మణుగులకు మణుగులు వెన్న వస్తుంది. కాని రోజల్లా చిలికితే రెక్కలు రెండూ పడిపోతాయి! అందువల్ల ఆ పని చేయటం లాభం లేదు.

చిట్టచివరకామెకు ఒక దివ్యమైన ఆలోచన తట్టింది. ఆమె ముఖం ఆనందంతో ప్రకాశించింది. తన చందుగాయ పెట్టెలో నాలుగు మొహరీలున్నాయి. వాటిని తీసి ఎంచటం ప్రారంభిస్తే సరి! సాయంకాలం దాకా ఎన్నో లక్షల, కోట్ల మొహరీలను

ఎంచవచ్చు. ఆ తరవాత తనకన్న భాగ్య వంతులు ప్రపంచంలో ఉండరు.

ఈ ఆలోచనతో ఆవిడకు మనసు పరవశమైపోయి అసలే నిద్రపట్టలేదు. ఎప్పుడు తెల్లవారుతుందా అని తూర్పు వేపు కిటికీకేసి చూస్తూ పడుకున్నది. చిట్టచివరకు కోళ్లు కూశాయి, తెల్లవారింది.

ధనికురాలు మంచం మీది నుంచి లేచి తన చందుగాయపెట్టెవద్దకు బయలు దేరింది. ఆమె ఒక అడుగు వేసిందో లేదో, ఎక్కడి నుంచో ఒక కందిరీగ వచ్చి మెడ మీద వాలి కుట్టింది. ధనికురాలు దాన్ని కొట్టేలోపుగా అది లేచి పారి పోయింది. ఆవిడ కోపంతో దాన్ని తరమ సాగింది. ఇంతలో ఇంకొక కందిరీగ వచ్చి ఆమెను కుట్టింది.

బిచ్చగాడి ఆశీర్వచనం అక్షరాలా నిజ మయింది. ఆ రోజల్లా ఆమెను కందిరీగలు కుడుతూనే ఉన్నాయి; ఆవిడ వాటిని వేటాడుతూనే ఉంది. కందిరీగలు లక్షల సంఖ్యలో, పుట్టపగిలినట్టుగా వచ్చి ధనికు రాలి ఇంటినిండా ముసిరాయి. ధనికు రాలికి మతిపోయింది. ఆమె ఆ కందిరీ గల నుంచి తప్పించుకోలేకపోయింది.

పొద్దూకేలోపల ఈ వార్త గ్రామ మంతటా వ్యాపించింది. ధనికురాలు సంపాదించుకున్న వరం ఏ విధంగా పరిణమించినదీ చూడటానికి గ్రామంలో గల స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ, వృద్ధులూ కదిలివచ్చారు.

ధనికురాలికి ముందటి రాత్రి గడవటం ఎంత కష్టమయిందో ఈ పగలు గడవటం కూడా అంత కష్టమయింది.

చిట్టచివరకు సూర్యాస్తమయ మయింది. కందిరీగలు ఎలా వచ్చాయో అలాగే వెళ్ళిపోయాయి. గ్రామస్థులు కూడా అక్కడి నుంచి వెళ్ళిపోయారు.

ఇక ఆ గ్రామంలో ఉండటానికి ముఖం చెల్లక, ధనికురాలు బండి చేయించుకుని, ఆ రాత్రే తన సామానంతా తీసుకుని గ్రామం విడిచి మరొక చోటికి ప్రయాణమై వెళ్ళిపోయింది.



ప్రకృతి వింతలు:

## ఎత్తయిన అగ్నిపర్వతం

అర్జెంటీనాలో వున్న అనాన్‌కాగువా ప్రపంచంలోకెల్లా ఎత్తయిన శాంతాగ్నిపర్వతంగా ప్రసిద్ధిగాంచింది. 22,834 అడుగుల ఎత్తుగల ఈ శాంతాగ్నిపర్వతమే పశ్చిమ శ్రేణులలో చాలా ఎత్తయిన పర్వతం!

## ఎగిరే మార్సూపియల్



ఫాలంజర్ జాతికి చెందిన మార్సూపియల్ అనే జంతువు ఎగరడంలో మంచినేర్పరి. ముందుకాళ్లకూ, వెనకకాళ్లకూ మధ్యవున్న వదులు చర్మాన్ని విరుచుకుని ఎత్తయిన చోటున ఎగిరి సుదూరంలో వున్న మరొక చోటికి ఎంతో నేర్పుగా చేరుకుంటుంది!

## బురదనది



చైనాలోని ఎల్లోరివర్‌ను (పసుపునది) ప్రపంచంలోకెల్లా బురదనదిగా చెప్పుకుంటారు. నదికిరువైపులా వున్న గట్టులనుంచి నదిలోకి జారిపడే పసుపురంగు బురదవల్ల ఈ నదికి పేరు వచ్చింది.

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1988 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ సెప్టెంబర్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: రోగానికి మందు!

రెండవ ఫోటో: ప్రయాణానికి ముందు!

పంపినవారు: పోహూరి శ్యామసుందర్, కృష్ణలంక, విజయవాడ–520 013

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


# చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు–600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు–600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---

A Super treat in every sweet!

SUPER SIZE!
SUPER TASTE!

nutrine
SuperStar
Premium toffees









TWIN TREAT
DELITE
TOP CREAM



Heavenly
delights



nutrine భారత దేశంలో అత్యధికంగా అమ్మబడే మిఠాయిలు

NC/8636

న్యూట్రిన్ కన్ఫెక్షనరి కంపెని ప్రై. లిమిటెడ్, చిత్తూరు ఆంధ్రప్రదేశ్